# వైశ్య ప్రబోధిని

తెలుగు మాస పత్రిక

జూన్

1994



శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరి దేవి



# శ్రీమత్ పెద్ద అహోబిళ ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం

రిజిష్టర్డు నెం. 195/88

2-2-21, షావుకారుపేట, ఆళ్ళగడ్డ - 518 543 (కర్నూలు జిల్లా)

సంప్రదించ వలసిన అడ్రసు

6-3-609/161, ఆనంద నగర్, ఖైరతాబాద్
హైద్రాబాదు - 500 004. ఫోన్ నెంబర్లు : 33795 , 224320

## నిత్యాన్నదాన పథకము

దక్షిణదేశ మందలి పవిత్ర పుణ్యక్షేత్రాలలో కర్నూలు జిల్లాలోని అహోబిళ క్షేత్రమూ ఒకటి. దిగువ అహోబిళము, ఎగువ అహోబిళము అని ఈ క్షేత్రము రెండు పుణ్యక్షేత్రాలుగా ఉండి, వరద, అభయ ముద్రలతో శ్రీ నరసింహ్మస్వామి అర్ధాంగి శ్రీ లక్ష్మీదేవి సమేతంగా ఇక్కడ కొలువుదీరి భక్తులను అనుగ్రహిస్తున్నారు. ఉత్తర, దక్షిణ భారత రాష్ట్రాలనుండీ భక్తులు ఈ క్షేత్రానికి విశేషంగా వచ్చి స్వామి వారి దివ్యమంగళ విగ్రహాన్ని సందర్శిస్తుంటారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు అరుదెంచే వైశ్య యాత్రీకులకు వసతి సౌకర్యాన్ని కలిగించుటకు గాను పెద్ద అహోబిళంలో నాలుగు అంతస్థుల భవనాన్ని మూడు సంవత్సరాల క్రితం నిర్మించినాము.

19-5-1989 నుండీ నిత్యాన్నదానం చేస్తున్నాము.

అన్నదాన పథకానికి రూ.1175/-లు విరాళంగా ఇచ్చినవారు శాశ్వత సభ్యులుగా ఉంటారు. ఆ మొత్తముపై వచ్చు వడ్డీతో, ఆ దాత పేరున సంవత్సరానికి ఒక్కరోజు శాశ్వతంగా వైశ్య యాత్రీకులకు భోజనం పెట్టడం జరుగుతుంది.

ఈ అన్నసత్రభవనాన్ని విస్తరిస్తున్నాం. అందుకు దాతల నుండీ విరాళాలు స్వీకరిస్తున్నాం. ఈ భవన నిర్మాణానికి గాను రు.2500/-లు లేక అంతకు పై బడి విరాళంగా ఇచ్చిన దాతల ఫోటోలు ఈ అన్నసత్ర భవనము లోపల ఉంచబడతాయి.

ఈ సత్రం భవన నిర్మాణానికి కానీ, నిత్యాన్నదాన పథకానికి కానీ విరాళం ఇవ్వదలచిన దాతలు నేరుగా పై పేర క్రాస్ చేసిన చెక్కు ద్వారా కానీ, క్రాస్ చేసిన డి.డి. ద్వారా కానీ పై సంప్రదించవలసిన అడ్రసుకు పంపి రసీదు పొందవలెను.

ఉదార హృదయముతో సహకరించవలసిందిగా వైశ్య మహనీయులను కోరుచున్నాము.

నిచ్చెనమెట్ల సుబ్బరాయుడు శ్రేష్ఠి — అధ్యక్షులు

మేడా నరసింహులు శ్రేష్ఠి — ప్రధాన కార్యదర్శి

V.P.- A5

# అఖిల భారత శ్రీశైల క్షేత్ర ఆర్యవైశ్య నిత్యాన్నపూర్ణ సత్రం

హెడ్ ఆఫీసు : కంభం
✆ : 62
ప్రకాశం జిల్లా.

బ్రాంచి ఆఫీసు : శ్రీ శైలం
✆ : 3158 (S.T.D. 085195)
కర్నూలు జిల్లా.

అక్షయ మహారాజ పోషకులు : ఈ సత్ర సంఘమునకు రు.11,500-00లు సమర్పించిన దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణించబడుదురు. అట్టి పైకమును షెడ్యూల్ బ్యాంకిలలో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయబడి అందుపై వచ్చు వడ్డీతో ప్రతి సంవత్సరము దాతకోరిన పేరుతో ఒక మహారాజ పోషక సభ్యత్వం పొందగలరు. అట్టి సభ్యత్వం పొందు దాతలు మహారాజ పోషకులుగా పరిగణింపబడుదురు. అక్షయ మహారాజ పోషకులు "18×15" అంగుళములు (ఫ్రేమ్‌తోసహా) గల దాత ఫొటో సత్రం ఆఫీసు నందు బిగించబడును.

రూ.1160-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు మహారాజ పోషకులుగాను, సర్వసభ్య సమావేశమునకు సభ్యులుగాను ఉందురు. ప్రతి సంవత్సరము దాతకోరిన రోజున వారి పేర సత్రములో యాత్రికులైన వైశ్య సోదరులకు సంతర్పణ జరుపబడును. ఆరోజు రాత్రి దాతపేర సాధువులకు అన్నదానము చేయబడును. "12×10" సైజులో దాత ఫొటో సత్రావరణములో పెట్టబడును.

రూ.116-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు జీవిత సభ్యులుగా ఉంటారు. ప్రతి కార్తీక శుద్ధ పాడ్యమి రోజున వీరందరి తరపున శ్రీ భ్రమరాంబా సహిత మల్లేశ్వర స్వామి వారికి కళ్యాణము జరిపించి, పూజా ప్రసాదాలు, సత్రము యొక్క జమ, ఖర్చులతో పోస్టు ద్వారా దాతలకు పంపబడుతాయి.

భోజనశాల, ప్రార్థనా మందిరము, కళ్యాణ మంటపము, గోశాల, సమావేశ భవనముతో కూడా 109 వసతి గదులు గల ఈ సత్రము ఆదర్శవంతంగా నిర్వహించబడుచూ, నిత్యాన్న దానము చేస్తున్నదని తెలియజేయుటకు సంతసిస్తున్నాము.

రాష్ట్ర, రాష్ట్రేతర పుణ్యక్షేత్రాలలో నిర్వహింపబడుచున్న నిత్యాన్నదాన సత్రాలకు ప్రతి ఏటా ఒకటి లేక రెండింటికి రూ.50,000/-ల నుండి రూ.1,00,000/-ల వరకు ఆర్థిక సహాయము అందించాలన్న తీర్మానము సర్వసభ్య సమావేశముచే ఆమోదించబడినందున ఈ సత్రమునకు ఆర్థిక సహాయం చేసిన దాతలు పరోక్షముగా రాష్ట్ర, రాష్ట్రేతర పుణ్యక్షేత్రాలలో నిర్వహింపబడుచున్న నిత్యాన్నదాన సత్రములకు కూడా దానము చేసినవారు ఔతారు.

పై మూడు పద్ధతులలో ఏదో ఒక పద్ధతిన ఈ అన్న సత్రమునకు ఆర్థిక సహాయాన్ని అందించి దైవ కృపకు పాత్రులు కమ్మని సోదరులకు విజ్ఞప్తి చేస్తున్నాము.

అన్నా సుబ్బ రంగయ్య
కార్యదర్శి

పోలిశెట్టి సత్యనారాయణ
అధ్యక్షులు

వైశ్య ప్రబోధిని
( మాసపత్రిక )
స్థాపితము
1969

సంపుటి
25

సంచిక
10

జూన్ -1994

సంపాదకులు :
'సంఘోద్ధారక',
'వైశ్యభూషణ'
ప.ల.

ఫోన్ : 45025
వైశ్య ప్రబోధినీ
కార్యాలయం
"వాసవీ భవన్ "
జయనగర్ కాలని,
విద్యామందిర్
తూ॥ భాగం
కడప - 516 002.

సంపాదకీయం

# రాజా శ్రేష్ఠికి శ్రద్ధాంజలి

రాజా శ్రేష్ఠి గారు **5.6.94**న పరమపదించారు. వీరి మరణంతో ఆర్యవైశ్య సంఘ చరిత్రలో ఒక తరం ముగిసినట్లే. వల్లూరు పుర చరిత్రలో ఒక అధ్యాయం ముగిసినట్లే.

శ్రేష్ఠిగారు మంచి దైవభక్తితత్పరులు. వైదికాచార పరాయణులు. శాస్త్ర విజ్ఞాననిధులు. నిరంతర భగవదర్చనా శీలురు. త్రికాల సంధ్యోపాసకులు. స్వయంగా వండి భగవంతునికి ప్రసాదం సమర్పించనిదే ఆయన భుజించే వారు కారు. అంత వరకూ ఏ పనికీ ఉపక్రమించే వారు కారు.

ఎంతటి దైవభక్తి గలవారో అంతకు మించిన పట్టుదల, కార్యదీక్ష గలవారు. 'వైశ్యులకు వేదోక్తము లేదు, పురాణోక్త కర్మలకే వారర్హులు' అను విషయములో శ్రేష్ఠి గారు జిల్లాలోని విప్రపురోహితులనే ఎదిరించారు. మాకులేని వేదార్హత మీకెక్కడ నుండీ వచ్చింది? అంటూ వారిని నిలదీశారు. తుది శ్వాస విడిచే వరకూ వైదికకర్మ నిష్ఠాగరిష్ఠులుగానే ఆయన జీవించారు. విధిలేని పరిస్థితుల్లో పురోహితులే ఆయనతో రాజీ పడ్డారు.

చిరకాలంగా అపరిష్కృతంగా ఉన్న శ్రీ వాసవీ బింబ-మంత్ర-యంత్ర-ఆరాధనా విధానాన్ని నిర్ణయించి, ఆంధ్ర ప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభకు సమర్పించింది శ్రేష్ఠిగారే. వీరి కృషివల్లనే ఆ సమస్య సమగ్రంగా, సశాస్త్రీయంగా పరిష్కృతమైంది. ఒక

సంవత్సర కాలం ఈ విషయములో శ్రేష్ఠి గారు నిరంతర కృషి చేశారు. మంత్ర, యంత్ర విషయాలలో కృషి చేసిన అనేక మందితో ఆయన చర్చించారు. శ్రేష్ఠిగారి ఈ కృషిని గుర్తించిన శ్రీ కాసంశెట్టి రాధాకృష్ణయ్య గారి ఆధ్యక్షతనగల ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభ 1981లో వీరిని భాగ్యనగరములో ఘనంగా సన్మానించింది. శ్రీ వాసవీ బింబ-మంత్ర-యంత్ర-ఆరాధనా క్రమాలను నిర్ణయించుట ద్వారా శ్రేష్ఠి గారు చేసిన వైశ్య సంఘ సేవకు వైశ్యులెల్లరూ శ్రేష్ఠి గారికి ఋణపడి ఉండక తప్పదు.

ప్రత్యూష పవనాంకూరాలుపైకొను వేళలో లేచి - తోటకేగి - అచ్చటి కేళాకూలిలో స్నానమాడి - సాంధ్య కృత్యాలు తీర్చి - సావిత్రిని జపించి - కర్మసాక్షి కెఱగి - ఉడికిన మడుగు దోవతులతో, పూజాపుష్పాలతో ఆయన రాజ వీధిలో వస్తూ ఉంటే, సాక్షాత్తూ బ్రహ్మ తేజస్సే నడయాడుతూ వస్తూ ఉన్నదా అనిపించేది. తన అనుదిన అర్చన కొరకూ, తనవారు నిర్మించిన ఆలయములోని సీతారాముల సేవకూ కావలసిన పుష్పములు తన తోటలోనే పెంచేవారు.

పుస్తక సముపార్జన శ్రేష్ఠి గారికి ప్రాణప్రదము. కొన్ని వేల గ్రంథాలను ఆయన తన జీవితకాలములో కొని, వాటిని సీతారామచంద్ర గ్రంథాలయము అను పేరుతో నిర్మించిన భవనములో పాఠకులకు ఉచితంగా అందుబాటులో ఉంచారు. ఆయన సమకూర్చిన గ్రంథాల విలువ లక్షకు పైబడే ఉంటుంది. వీటిలో అమూల్యమైనవి, అరుదుగా లభించేవి - పరిశోధనకు ఉపకరించేవి అయిన వాటి సంఖ్యే ఎక్కువ. ఈ గ్రంథములను కొనేందుకు కానీ, గ్రంథాలయ నిర్వహణకు కానీ శ్రేష్ఠి గారు ప్రభుత్వం నుండీ పైసా కూడ పుచ్చుకోలేదు. కేవలం తన ద్రవ్యముతోనే వీటిని కొన్నారు. వీటికి కావలసిన భవనాన్ని నిర్మించారు. వీరి గ్రంథాలయ సేవను గుర్తించిన కడప జిల్లా గ్రంథాలయ సంస్థవారు ఘనంగా సత్కరించి వీరికి ఒక అవార్డును కూడ ఇచ్చారు. తన తదనంతరము గ్రంథాలయ నిర్వహణ అనుకున్న విధంగా సాగదేమో! అన్న సంశయముతో శ్రీ రాజా శ్రేష్ఠి తాను జీవిత కాలం సముపార్జించిన గ్రంథాలన్నింటినీ కడపలోని సి.పి.బ్రౌను గ్రంథాలయానికి

ఉచితంగా ఇచ్చారు.  ఆ గ్రంథాలయ సంస్థవారు గ్రంథాలయములో ఒక గదిని పూర్తిగా వీరి పుస్తకాలకే కేటాయించి అందులోనే వాటిని పొందుపరచారు. వీరి ఉదారతకు చిహ్నంగా, వీరి జ్ఞాపకార్థంగా వీరి మరియు వీరి శ్రీమతి విమలమ్మ గారల నిలువెత్తు ఛాయా చిత్రాన్ని ఆ గది ప్రవేశ ద్వారము వద్ద ఉంచారు.

శ్రేష్ఠి గారిది జమీందారీ తరహా కుటుంబము. కడప జిల్లాలోని ప్రసిద్ధ కుటుంబాలలో ఒకటి కూడ. విస్తారమైన భూ సంపదగలవారు రాజా గారు. రాజా గారు వ్యాపారం చేసే వారు కారు. కేవలం భూముల మీద వచ్చే ఆదాయంతోనే జీవించారు. రాజా గారి పూర్వులు తమ ఆరాధ్య దైవమైన శ్రీ సీతారామచంద్రుల వారికి స్వధనంతో వల్లూరులో ఒక దేవాలయాన్ని కట్టించి, ఆ ఆలయ నిర్వాహణకు కొంత భూమిని కూడ కేటాయించి ఉంచారు. శ్రేష్ఠి గారు ఆ దేవాలయ నిర్వహణను కూడ తన స్వంత ధనముతో జరపడమే కాక స్వాముల వారికి స్వర్ణ, రజత భూషణాలనూ, పట్టుపీతాంబరాలను తన హయాములో సమకూర్చారు.

వైదిక సాంప్రదాయాలవలెనే వైశ్య సాంప్రదాయాలు కూడ క్షుణ్ణంగా తెలిసిన వారు రాజాగారు. వైశ్య సంఘాలూ, రాష్ట్రస్థాయి వైశ్య సంస్థలూ చేస్తున్న అనేకానేక సాంప్రదాయ వ్యతిరేక విషయాలను ఎత్తి చూపి, సంస్కరించుకోవాల్సిన ఆవశ్యకతను తెలిపిన వారు. అలా తెలుపడములోని ఆయన ఆవేదనను గానీ అంతర్యాన్ని గానీ గమనించి అవి గౌరవించలేక పోయాయి.

రాజా శ్రేష్ఠి గారు వైశ్య సంఘానికి చేసిన సేవనూ, ఆ సంఘం విషయములో బాధ్యతతో వ్యవహరించిన తీరునూ వివిధ కోణాల నుండీ పరిశీలిస్తే ఆయనకు వైశ్య సంఘము సర్వదా కృతజ్ఞతగా ఉండక తప్పదు.

'రాజా శ్రేష్ఠి' అనేది ఆయనకు మధ్యలో వచ్చి ప్రసిద్ధమైన నామధేయము. ఆయనకు తల్లిదండ్రులు పెట్టిన పేరు వెంగన్న శ్రే. ఇంటిపేరు పోలేపల్లె. శ్రేష్ఠి గారి జన్మ స్థలము వల్లూరు. కడప జిల్లాలోని మండల కేంద్రాలలో ఒకటి. వీరికి మా శ్రద్ధాంజలి.

వైశ్యప్రబోధిని, జూన్, 1994

# శ్రీ కన్యకా ప్రశస్తి

రచన : శ్రీ దోగుపర్తి వెంకటరమణ

నీ సౌందర్య విశీర్ణకీలికలు అగ్నిన్ రేగి, వంశాంకురా
శా సంపత్తి పరాభవానల భయాశ్వాసమ్ములోనీల్గ, మా
తా! సౌశీల్యము వంశరక్షణ పరిత్రాణార్థమై జీవరే
ఖా సాహిత్య చరిత్ర ముద్రవడె నోంకారాంకితమ్మై !

స్పందించెన్ జగతీ సహస్రములు సంసంధించె నైక్యముగా
నందా లొక్కట కీలలై దహనమాయాబంధ రూపమ్ములో
సింధూరారుణ రక్తచందన తనుశ్రీలైరి స్త్రీ లందరున్
ముందున్ వెన్కలు నీవెగా మునిగిర మ్మోక్షాగ్నిధారాశ్రులన్ !

తల్లడిలెన్ హృదంతర నదవ్యథలై కులదీపికల్ జగా
త్రుళ్ళెడి రాజగర్వగుణ దౌర్బలమూగి యెదుర్కొనంగ మా
తల్లి! నీ దారుణాగ్ని సుడిదారులకొట్టుకలాడు సంతతుల్
పెల్లుబికిన్ మహోత్సవనవీధి నిరామయ త్యాగశక్తిమై !

వంశగోత్రాది మర్యాద వత్ప్రతిష్ఠ
శిష్టజన సంప్రదాయ సంతుష్టికలుగ
లోక లోకాలు గుణపాఠ మాకళింప
నేర్పితివి జననీ! దయనీయగతిని!

నీ వవతరించితి జగతి నృపతి వితతి
పాలనా నిరంకుశత ప్రపంచమెఱుగ
లేనియెడ తల్లి నే కోరి పూనుకొన్న
నీచు తలవెయ్యి వ్రయ్యలై నేలరాలె!

నీవు కులదేవిగా మాది దేవతా కు
లమ్ముగా గణ్యమై ప్రపంచమ్ములోన
త్యాగదేహులై నిస్వార్థులై గమించి
నీ అడుగుజాడలోన పునీతులైరి!

వైశ్యప్రబోధిని, జూన్, 1994

# శ్రీ దోమా వెంకటస్వామి గుప్త

( గత సంచిక తరువాయి )

గుప్తగారు అష్టాదశ పురాణాల్లో ఒకటైన బ్రహ్మవైవర్త పురాణం లోని బ్రహ్మ ఖండాన్ని మూడు భాగాలుగా, ప్రకృతి ఖండాన్ని 35 భాగాలుగా పద్యాలలో అనువదించారు. బ్రహ్మ ఖండం మూడు భాగాలను తెనాలిలోని సుందరరాం అండ్ సన్స్ వారు ముద్రించారు. అయితే వాటికి సంబంధించిన హక్కులన్నింటినీ గుప్తగారే ఉంచుకొన్నారు. భగవద్గీతకు కూడా వ్యాఖ్యానం వ్రాశారు.. ముద్రణ కూడా అయింది. గుప్త గారు వచనంలో వ్రాసిన మహాభారతం లోని ద్రోణ పర్వం అచ్చు ప్రతి ఒకటి లభిస్తూ ఉంది. దీనిని బట్టి వ్యాసుని సంస్కృత మహాభారతాన్ని గుప్త గారు వచనములో వ్రాసినట్లుగా భావించుటకు అవకాశం కనిపిస్తోంది.

"తుంగభద్రాతీర రంగస్థలంబైన
కందనోల్గా మంబు కాపురంబు
శతావధాని విధాన సంధాన గురువులు
తిరుపతి వెంకటేశ్వరులు గురులు
అష్టావధాన శతావధానాళు క
విత్వముల్ చేయంగ వెలయు పనులు
ప్రకృతంబు జెన్న పురి క్రైస్తవ కళాశా
లాంధ్ర బోధకత యొప్పౌఱు పదవి
సజ్జనుల గొల్చుటందె యుత్సాహగరిమ
దోమ వెంకటస్వామి గుప్తా మలాఖ్య
నొప్పువాడ నా కృతులను నొప్పుడయ్య
భవ్యగుణులార! యో! యార్యవైశ్యులార!"

ఈ పద్యము తేట గీతలో గల నాల్గవ పాదాన్ని సందర్భాన్ని బట్టి మార్చుచూ తనను పరిచయం చేసుకొనేవారు గుప్తగారు.

లభ్యమగుచున్న ఆధారాలను బట్టి గుప్తగారు 23 పద్య కావ్యాలనూ, దాదాపు పదివచన గ్రంథాలనూ, నాలుగు యక్ష గానాలనూ, ఒక విమర్శనా గ్రంథాన్నీ, రెండు నవలలనూ, ఒక అపరాధ పరిశోధక నవలనూ, ఒక అనువాద గ్రంథాన్నీ, ఒక శతోత్తర నామావళినీ వ్రాసినట్లు తెలుస్తుంది. శ్రీ కన్యకా పురాణములో గుప్తగారు వ్రాసిన విమర్శాలేశము ఆయన లోని సనాతన అధునాతన భావాలకు మేలికలయిక. గుప్తగారు 1740 పద్యాలతో రచించిన 'విష్ణుభక్తి' అను గ్రంథాన్ని స్వర్గీయ చుండూరు వెంకటరెడ్డిగారు తమ ధనముతో ముద్రించి గుప్తగారిని వేయిన్నూట పది హారు రూప్యములతో సత్కరించారు. కానీ ఆ గ్రంథము బయటి ప్రపంచాన్ని చూడ లేదు. గుప్తగారి రచనల్లో అన్నింటి కన్నా పెద్దది బ్రహ్మ వైవర్త పురాణము. ఇందులో బ్రహ్మ ఖండము మాత్రమే ముద్రితము. ఎంతో కష్టించి వ్రాసిన ఆ పురాణము ముద్రణ భాగ్యానికి నోచుకోకపోవడము గుప్తగారిని చివరి శ్వాస వదిలే వరకూ వేధించింది. వ్యాసులు రచించిన పద్దెనిమిది పురాణాల్లో ఒక్కటైన – ఆ బ్రహ్మవైవర్త పురాణాన్ని ఈయన ముచ్చటైన తెలుగు పద్యాలతో అనువదించారు.

గుప్త గారి పద్యాలలో సీసములే ఎక్కువగా కన్పిస్తాయి. అవి కూడా ఏ పాదానికి ఆ పాదము తెగి ఉంటాయి. అయిదు పాదాలతో పద్యాన్ని వ్రాసే అలవాటు కూడా గుప్తగారికి ఉన్నట్లు కన్పిస్తుంది. అయిదు పాదాలతో పద్యాన్ని వ్రాయడము ఛందో లక్షణానికి విరుద్ధము కాదు. కానీ భారత కవులెవ్వరూ అయిదు పాదాలతో పద్యాన్ని వ్రాసినట్లు కన్పించదు.

గుప్తగారు 1899లో కర్నూలులో జన్మించారు. కర్నూల్ ప్రాంతాన్ని కలరా వ్యాధి పీడించగా తన మేనమామగారి స్వస్థలమగు గుంటూరు చేరుకొన్నారు. తదాది జీవితాంతం వరకూ గుంటూరు, విజయవాడ పట్టణాలే కార్యరంగాలైనవి. మధ్యలో 1916లో గుప్తగారి ఉద్యోగ జీవితం ప్రారంభమైంది. కంచిలోని పచ్చయప్ప కళాశాలలోనూ, పెరుంబుదూరులోనూ, కర్నూలుజిల్లా కోవెలకుంట్లలోనూ ఆంధ్రోపాధ్యాయులుగా పనిచేశారు. మద్రాసులోని పచ్చయప్ప కళాశాలలోనూ, విజయవాడలోని ఎస్.ఆర్.ఆర్ మరియు సి.వి. ఆర్. కళాశాలలోనూ ఆంధ్రోపన్యాసకులుగా పనిచేశారు. మద్రాసులో పని చేస్తున్నపుడే "పరకాల విలాసము" అనుపేర తిరుమంగై ఆళ్వారు చరిత్రను వ్రాశారు. గుప్తగారు విజయవాడలో ఆంధ్రోపన్యాసకులుగా ఉన్నపుడు స్వర్గీయ విశ్వనాథ సత్యనారాయణ గారు కూడ అదే కళాశాలలో పనిచేశారు.

బాలకవి, బాలకవి శిఖామణి, విద్యావినోద, కవిభూషణ, విద్యాసాగర, సుకవిరత్న, ఆశుకవి తల్లజ, ఆశుకవితా ధురీణ, కవి కుంజర, అవధాని పంచానన, అవధాని పితామహ, కవితా చక్రవర్తి అను పంద్రెండు బిరుదులు గలిగియుండినవారు గుప్తగారు. వీరు చెన్నపురి ఆంధ్ర మహాసభకు గౌరవ సభ్యులుగా ఉండినారు. వీరు యస్.యస్.ఎల్.సి. పరీక్షలకు అధికారిగాను, ఆంధ్ర, చెన్నపురి అన్నామలై, బెనారస్ విశ్వవిద్యాలయాలు నిర్వహించిన స్నాతక, స్నాతకోత్తర పరీక్షలకు పరీక్షాధికారిగా కూడ పని చేశారు. "చంద్రిక" అను పత్రికకు కొన్నాళ్ళు సంపాదకులుగా ఉండినారు. మద్రాసులో వాఙ్మయ వినోదినీ గ్రంథమాలను స్థాపించారు. మద్రాసులో ఉన్నపుడు కొన్నాళ్ళు స్వంత ముద్రణాలయాన్ని నడిపారు. అలంపురి మహాత్మ్యాన్ని వివరించే బ్రహ్మేశ్వర పురాణాన్నీ, గౌతమక్షేత్ర మహాత్మ్యాన్నీ తన ఈ స్వంత ముద్రణాలయములోనే ముద్రించారు. మద్రాసు విశ్వ విద్యాలయం వారు గుప్తగారి రచనలలో కొన్నింటిని కళాశాల విద్యార్థులకు పాఠ్య పుస్తకాలుగా పెట్టియుండినారు. అట్టివానిలో సుజనత్రయ మొక్కటి. గుప్త గారు 1962లో గుంటూరు పట్టణములో స్వర్గస్థు లయ్యారు. గుప్తగారు దాదాపు నలభై స్వర్ణ రజత పతకాలను పొందారు. అవధాన సమయములో తాను గడించిన ఈ పతకాలను ధరించే వారట. ఈ పతకాలలో కొన్నింటిని ఎవరెవరు, ఏయే సందర్భాలలో బహూకరించింది గూడ గుప్తగారు

వైశ్యప్రబోధిని, జూన్, 1994

ఒక సీస పద్యములో చెప్పుకొన్నారు.

గుప్తగారు మంచి గ్రంథ కర్తలే కాదు. గొప్ప ఉపన్యాసకులు కూడా. గుప్తగారు ఇచ్చిన ఉపన్యాసాల పట్టికను వీరి "శ్రీ కన్యకా పురాణం" మీద పరిశోధన చేసి యం.ఫిల్., పట్టాను పొందిన అనకాపల్లె వాస్తవ్యులు శ్రీ రేపాక సత్యనారాయణ గారు తమ పరిశోధనా గ్రంథములో వివరంగా పేర్కొన్నారు. చదువుల తల్లి కరుణా కటాక్షాలను కోకొల్లలుగా దోచుకున్న గుప్తగారు కలుముల జవరాలి కడగంటి చూపులకు కూడ నోచుకోలేకపోయారు. జీవితాంతం దుర్భర దారిద్ర్యాన్నే అనుభవించారు. గుప్తగారి జనకులు శ్రీ గోవిందప్పశ్రేష్ఠి. తల్లి శ్రీమతి కోటమ్మ. భార్య శ్రీమతి వెంకటసుబ్బమ్మ.

1949 మే 2వ తేదీ గుప్తగారి జీవిత చరిత్రలో అత్యంత శుభ దినమూ, ఆనందదినమూ కూడ. కవిగండ పెండేరము, కనకాభిషేకము వీరికి లభించిన రోజది. విజయవాడ మహాపట్టణములో జరిగిన ఈ ప్రధానోత్సవ సభకు అప్పటి మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ అధ్యక్షులు శ్రీ ఆర్.బి. రామకృష్ణంరాజు గారు అధ్యక్షత వహించారు. "కళాప్రపూర్ణ", "కావ్యతీర్థ" స్వర్గీయ జనమంచి శేషాద్రి శర్మగారు ఆ సభను ప్రారంభించారు. అప్పటి శాసనసభ్యులగు శ్రీ పైడా వెంకట నారాయణగారు గండపెండేరాన్నీ, సువర్ణ పాత్రనూ, సన్మాన పత్రాన్నీ గుప్తగారికి సమర్పించారు. శ్రీ యుతులు మని కొండ కాశీ విశ్వనాథం, వెంకటనరసింహం గారు గుప్తగారికి కనకాభిషేకం చేశారు. ఆ తరువాత కన్నుల పండుగగా విజయవాడ మహానగర వీధుల్లో గుప్తగారిని మహా వైభవంగా గజముపై ఊరేగించారు.

గుప్తగారు 2-2-1938వ తేదీన జాతిపిత మహాత్మాగాంధీ గారిని కలిసి అవధాన విద్యను గురించి వివరించినట్లూ, మహాత్ముడు అందులకు ఆశ్చర్యాన్ని ప్రకటించి,"అవధాన సాధన కష్టమైంది అనీ, గుజరాతి, అరవము మొదలగు అన్యభాషలకు యీ ప్రక్రియ లభించ లేదనీ, అవధాన విద్య నభ్యసించుటకు సరస్వతీ ఉపాసనా శక్తి అవసరము"నీ చెప్పినట్లు పై తేదీన వెలువడిన ఆంధ్రపత్రిక ప్రచురించింది.

బ్రహ్మ శ్రీ జనమంచి శేషాద్రిశర్మ, అనుముల విశ్వనాధశాస్త్రి, జనమంచి సుబ్రమణ్యశర్మ మొదలగు మహాకవులచే గుప్తగారు ప్రశంసలనందు కొన్నారు. గుప్తగారు 19, 20 శతాబ్దాలకు చెందిన వారు అయినా ఆయన పద్యాల్లో ఎక్కువగా ప్రబంధశైలే కన్పిస్తుంది. భావకవితా ధోరణి అంతగా కన్పించదు. భావకవిత్వం మీద కంటే ప్రబంధ కవిత్వం మీద గుప్తగారికి గల ఎక్కువ మక్కువే ఇందుకు కారణము. భావ కవిత్వము కూడ వ్రాయ గలడనేందుకూ, సామాజిక స్పృహ, దేశభక్తి కలదు అనేందుకు ఈ పద్యాన్ని ఉదాహరణంగా చెప్పవచ్చు.

"భారతదేశమాత కలిభంగి నభంగుర
భంగ మొద్ది బా
దారటనంబు జల్పెడిగదా? యిటువంటి
విపర్య యాన మీ

ర్ధారుణి జేరబోయి యటదగ్గ తెఱంగు
నెసంగజేయ వ
ల్దా రయమార వైశ్యులు! సురా
రుచిరాశయు లెంత యేవియున్"

గుప్తగారి గ్రంథాల్లో ప్రాచీనకావ్యాలకు, పురాణాలకు సంబంధించి చేసిన ఆంధ్ర పద్యాను వాదాలే ఎక్కువ. అట్లని గుప్తగారిలో సృజనాత్మకత లేదని చెప్ప కూడదు. సృజనాత్మకత పూర్ణంగా లేనిదే అష్టావధాన, శతావధానాలు చేయలేరు. గుప్త గారి రచనల్లో ఎక్కువ అముద్రితాలు. ముద్రితాలు తక్కువ.

వీరు వ్రాసిన గ్రంథాలన్నింటిలోకి శిరోమాణిక్యము శ్రీ కన్యకా పురాణము. శ్రీ కన్యకా పురాణము ఆర్యవైశ్యుల కులదేవత శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ ఇతివృత్తముగా గలది. ఇందులో గుప్తగారు అష్టాదశవర్ణనలలో పంద్రెండింటిని సుష్టుగా పోషించారు. వీరు పురాణాన్ని వ్రాయుట ద్వారా శ్రీవాసవీ ఇతిహాసానికి కావ్య గౌరవము లభించింది. అనకాపల్లె వాస్తవ్యులు శ్రీ రేపాక సత్యనారాయణ గారు ఈ కన్యకాపురాణము మీద పరిశోధన జేసి ఆంధ్ర విశ్వ విద్యాలయము నుండి యం.ఫిల్., పట్టాను పుచ్చు కొన్నారు. ఇది ప్రథమ రచన అనీ, ఇది పరిపక్వ దశలోసాగిన్న రచన అనీ చెప్పేందుకు గుప్తగారి రచనల్లో ఎక్కడా తేడా కనిపించదు.

గుప్తగారు తాను వ్రాసిన ప్రతి గ్రంథములోని అశ్వాసాంత గద్యలోనూ తన జన్మస్థల వివరాలూ, వంశ వివరాలూ, తనకు గలిగిన గౌరవాలు, అంత వరకూ తాను వ్రాసిన కావ్యాల పేర్లూ వివరంగా చెప్పుకొన్నారు. తనను గురించీ, తన కావ్యాల గురించీ సర్వవిషయాలు తన తర్వాత వారికి వివరంగా బోధపడేలా ఉండాలనేదే ఇంత వివరంగా వ్రాసు కోవడములో గల గుప్తగారి ఉద్దేశ్యము. పోతనాదుల జన్మస్థల వివరాలూ, కొన్ని ప్రసిద్ధ గ్రంథాల గ్రంథ కర్తృత్వ వివరాలపై జరుగు వివాదాలు గుప్తగారు వినియున్న వారు కాబట్టే ఈ జాగ్రత్త వహించారు. "విజయసేనము" అను ఒక ప్రసిద్ధ ప్రాచీనకావ్యం ఉంది. తిక్కన కృతమని కొందరూ, కాదని కొందరూ ఇప్పటికీ 'జుట్లు' పీక్కుంటూనే ఉన్నారు. ఈ విషయాలు తెలియని వారు కారు గుప్తగారు. ఇంత వివరంగా తనను గురించిన వివరాలను అశ్వాసాంత పద్యాలలో వ్రాసుకొన్నవారు గుప్తగారొక్కరేనేమో?

మూక మహాకవి సంస్కృతములో రచించిన "మూక పంచశతిని" గుప్తగారు పద్యాలలో అనువాదం చేశారు. ఈ మూక పంచశతిని 1953లో ఆనాటి ప్రముఖ పత్రికల్లో ఒకటైన త్రిలిఙ్గ పత్రిక ధారావాహినిగా ప్రచురించింది. దాన్ని పుస్తక రూపములో అచ్చొత్తించాలన్న ఉద్దేశ్యముతో అందలి అచ్చు తప్పులను కూడ దిద్దిముద్రణకు సిద్ధంగా ఉంచుకొని ఉండినారు. కానీ ఆ పుస్తకానికి ముద్రణా యోగము కలిగినట్లు కన్పించదు.

పరమేశ్వర కృపాలబ్ధ పరిపూర్ణులు కాబట్టే గుప్తగారికి ఇంతటి కవితా శక్తి అలవడింది. ఒక వ్యక్తి తన జీవిత కాలమంతా పరిశోధన చేసినా తరగనంత

కావ్య సంపదను గుప్త గారు సృష్టించి పోయారు. వీరి పద్యాలకు గానీ, గ్రంథాలకు కానీ రావలసినంత ప్రశస్తి, ప్రచారమూ రాలేదు. అంత మాత్రాన గుప్తగారిని తక్కువ కవిగా అంచనా వేయడానికి వీలులేదు. కొందరికి ప్రతిభా వ్యుత్పత్తులు పుష్కలంగా ఉంటాయి. అదృష్టం ఉండదు. కొందరికి అదృష్టం ఉంటుంది. ప్రతిభ, పాండిత్యము, వ్యుత్పత్తులు ఉండవు. రెండూ గల వారు బహు తక్కువగానే కన్పిస్తారు. ఒకే వ్యక్తి వ్రాసిన కావ్యాలన్నింటికీ సమానమైన ప్రశస్తి, ప్రాచుర్యమూ లభించదు. స్వర్గీయ గడియారం వెంకట శేష శాస్త్రిగారు వ్రాసిన శ్రీ శివభారతానికి వచ్చిన ప్రశస్తి, ప్రఖ్యాతి ఆయనే వ్రాసిన ఇతర కావ్యాలకు రాలేదు. వాస్తవానికి రామాయణములోని శాస్త్రిగారి రచన మరింత పరిపక్వంగానూ, పాండితీ ప్రకర్షణతోను ఉండి శాస్త్రిగారి వైదుష్యాన్ని అద్దంపట్టి చూపుచూ ఉంది.

*(ఈ వ్యాసము లోని కొంత భాగాన్ని కడప ఆకాశవాణి కేంద్రము వారు ఈ భావ ఉగాది 11.4.1994 ఉదయం ప్రసారం చేశారు.)*

## విశాఖలో ఉచిత వివాహాలు

వరుని కుదుర్చుకొన్న వధువు తరపు వారు కానీ లేక వధువును కుదుర్చుకొన్న వరుని తరపువారు కానీ సుముహూర్తాన్ని నిర్ణయించుకొని తమ వద్దకు వస్తే కమనీయంగా కళ్యాణం జరిపించాలి అన్న మహోన్నత ఆదర్శ నిర్ణయం తీసుకొని అటువంటి మహదవకాశం ఎప్పుడా అని ఎదురుచూస్తున్న విశాఖపట్నంలోని శ్రీ వాసవీ కళ్యాణమంటప సంఘం వారు, సబ్బవరం వాస్తవ్యులు చి॥ పెన్నం రాంబాబు, బల్లంకి గ్రామ వాస్తవ్యురాలు చి॥ సూరిమణికినీ; విశాఖ పట్నం కాపురస్తుడు చి॥ అశోక్ కుమార్, సదరు పట్టణ వాస్తవ్యురాలు చి॥ సులోచనకినీ 28.5.1994వ తేదీన సర్వఖర్చులను భరించి (ఫ్రీగా) శ్రీ వాసవీ కళ్యాణ మంటపములో వివాహం జరిపించారు.

## వివాహం



చి॥ జ్యోతి     చి॥ శ్రీనివాస్ గుప్త

మహబూబ్‌నగర్ జిల్లా కోస్గి పట్టణ ప్రముఖులు శ్రీ అనంత శ్రీనివాస్ గుప్త గారి ప్రథమ కుమార్తె చి॥ జ్యోతి వివాహం, రంగారెడ్డి జిల్లా పర్గి వాస్తవ్యులు శ్రీ ఆకారపు రాములు గుప్త గారి ప్రథమ కుమారులు చి॥ శ్రీనివాస్ గుప్తతో 20.5.1994వ తేదీన కోస్గిలోని కన్యాదాత స్వగృహములో వైభవంగా జరిగింది.

# సూక్తి ముక్తావళి

" ఉపకారికి ఉపకారము విపరీతముగాదు
సేయ వివరింపంగా
అపకారికి ఉపకారము నెపమెన్నక
సేయువాడు నేర్పరి సుమతి "

ఉపకారం చేసిన వ్యక్తికి ప్రత్యుపకారం చేయుట అనేది యిచ్చి పుచ్చుకొనే వ్యాపారము. అపకారం చేసిన పాపాత్మునకు ఉపకారం చేయుట అనే లక్ష్యం అసామాన్య మైనది. ఆ చేసేది కూడా నెపమెన్నక చేయవలెనన్నాడు కవి. నీవు ఫలానా అప్పుడు నాకు ఫలానా అపకారం చేసినావు. అయినా నేను నీకు ఉపకారమే చేస్తున్నాను. నీ పాపాన నీవు పోతావు. అని ఎత్తి పొడవ కుండా గొప్ప మనసుతో ఉపకారం చేసే వాడు నేర్పరి. నేర్పరి అంటే చతురుడు. వాని చాతుర్యమేమిటి? వానికి జ్ఞానో దయం కలిగే విధముగా ప్రవర్తించడమే. కం॥ కృతమును మరువని వాడే కృతజ్ఞుడు. కృతజ్ఞు డొందు నిందున్ నందున్ మితి లేని సౌఖ్య సంతతి. కం॥ కృతమును మరచినవాడే కృతఘ్నుడు. కృతఘ్ను డొందు నిందున్ నందున్ మితి లేని దుఃఖ సంతతి: అనగా కృతజ్ఞుడు యిహ పరములందు సుఖపడును. కృతఘ్నుడు యిహపరములందు దుఃఖపడును.

మహా భారతంలో నాడీ జంఘుడనే ఒక కొంగ కథ ఉంది. ఒక బ్రాహ్మణుడు ఆచారభ్రష్టుడై, కిరాతకస్త్రీని జత చేసుకొని హేయమైన జీవితం గడుపుతూ ధన సంపాదన బుద్దితో ఒక వ్యాపార గుంపులో చేరి అడవిలో ప్రయాణిస్తూ ఉండగా ఒక మదగజము వ్యాపారుల గుంపు మీద బడి, మనుష్యులను త్రొక్కి చంపుతుంది. ఆ బ్రాహ్మణుడు తప్పించుకొని పోయి ఒక మర్రిచెట్టు క్రింద చేరినాడు. ఆ మర్రి చెట్టు నాడీజంఘుని నివాస స్థలం. చెట్టు క్రిందకు వచ్చిన బ్రహ్మ బంధువును తన అతిథిగా భావించి ఆ మహాబకము ఆతిథ్య మిచ్చింది. గంగానది నుండి చేపలు తెచ్చి పక్వం చేసి పెట్టింది. అడవిలోని తియ్యని పండ్లు తెచ్చిపెట్టింది. వాడు సుష్టుగా ఆరగించినాడు. రాత్రి కాగానే చిగురు టాకులతో వానికి సెజ్జ సమ కూర్చింది. తెలవారగనే నాడీజంఘు డిట్లన్నాడు. కం॥ విను మిత్రుండును, రజతము కనకము బుద్ది యును నాల్గు కారణములు మర్త్యుని దారిద్ర్యము వాయుటకని దేవ గురుండు సెప్పె నన్నిటి లోనన్ మిత్రుండెక్కుడు.

అయ్యా! నేను నీకు మిత్రుడను. నా మైత్రి వలన నీకు కావలసినంత ధనం లభిస్తుంది. విను. మధువ్రజపురంలో నా మిత్రుడు విరూపాక్షుడనే వాడున్నాడు. నా పేరు చెప్పి అడుగు. నీకు కావలసినంత డబ్బు యిస్తాడు. వెళ్ళు అనింది. కొంగ చెప్పినట్లు వాడు వెళ్ళి విరూపాక్షుని వద్ద డబ్బు తెచ్చుకున్నాడు. మార్గాయాసంతో వచ్చి మర్రి చెట్టు క్రింద కూర్చున్నాడు. కొంగ సంతోషించి అతనికి ఆతిథ్య మిచ్చింది. ఆ రాత్రి అక్కడే పండు

కున్నాడు. కొంగ రెక్కలతో అతనికి చల్లగా విసరుతూ ఉంది. రాజ భోగ మనుభవిస్తూ ఆ కిరాతకుడు ఇట్లు ఊహించినాడు. రేపు ప్రొద్దున్నే నేను ప్రయాణమై పోవలెగదా. దారి బత్తెము లేదు. ఈ కొంగ బాగా బలిసి ఉంది. దీన్ని చంపి మాంసం మూటగట్టుకొని పోతాను. అని తన ప్రావున కునుకుతూ ఉన్న కొంగను చంపి దాని మాంసం మూటగట్టుకొని బయలుదేరినాడు. ఎంత కృతఘ్నత! కొంగకు సన్నిహిత మిత్రుడైన విరూపాక్షుడీ సంగతి పసిగట్టి కిరాతుకుని కాళ్ళుసేతులు కట్టి తెప్పించి తన భటులైన రాక్షసులతో ఈ దుర్మార్గుని చంపి తినండి అన్నాడు. ఆ రాక్షసులు కృతఘ్నునిమాంసం మేము తినము అన్నారు. తర్వాత నాడీజంఘుడు దైవ వశమున బ్రతకడము, యింద్రుని చేతులతో పాశబద్ధుడైన బ్రాహ్మణుని విడిపించమని నాడీజంఘుడు ప్రార్థించడం జరుగుతుంది. ఈ కథ అపకారికి ఉపకారము చేయు నేర్పరితనాన్ని ప్రబోధిస్తుంది.

*(శ్రీ జూటూరు రమణయ్య గారి ఆకాశవాణి ప్రసంగాల నుండి)*

# నేను, నాదేశం

( గత సంచిక తరువాయి )

1924లో ప్రారంభించి 1930 వరకు ఈ వితంతూద్వాహోద్యమాన్ని ఎంతో ఉత్సాహంతో నిర్వహించాను. ఆటంకాలు, కష్టాలు పోయి, నా మిత్రులనేకమంది స్వయంగా చేయించగలిగారు. అందువల్ల నా బాధ్యత తగ్గింది. ఇక నా దృష్టి ఇతర సంస్కరణలమీదికి మళ్ళినది. భ్రూణ హత్యలను నివారించి శిశువులను కాపాడా లనే ఉద్యమం ప్రారంభించాను. వితంతు వివాహోద్యమంలో పాల్గొనడం తగ్గించాను.

భార్యల సహాయంలేనిదే స్త్రీల ఉద్య మాలను పురుషుల మెంత శ్రమపడినా జయప్రదం చెయ్యలేము. నా ప్రథమ భార్య అన్నపూర్ణమ్మకు స్త్రీ ఉద్యమాల యందు ఎంతో ఉత్సాహముండేది. ఎందరో స్త్రీలు మా యింట్లో ఉండేవారు. వారందరిని ప్రేమతో ఆదరించేది అన్నపూర్ణ. వారు అన్నపూర్ణమ్మను ఎంతో ప్రేమించేవారు. జయాపజయాలు, ఫలితాలు మా యిద్దరివీని. 1931 సం॥ లో అన్నపూర్ణమ్మ హఠాత్తుగా చనిపోయి నది. అప్పుడు మా అనుభవాలను గురించి 'భారతి' లో రెండు వ్యాసాలు వ్రాసి ప్రకటించాను.

## వితంతు శరణాలయ స్థాపన

భూతదయగలవారికి ప్రతి సంఘం లోను ఎంతో కుళ్ళు కనపడుతుంది; ముఖ్యంగా మనదేశంలో మన సంఘంలో మరీ ఎక్కువ. అమానుషకార్యాలు కూడా సాంప్రదాయ బలిమివల్ల సరైనవిగానే కనబడుతాయి ప్రజాస్వామ్యానికి. బాల వితంతువుల కష్టాలైతేనేమి, వంశపారం పర్యా వచ్చే వ్యభిచారవృత్తి అయితేనేమి, అంటరానితనమైతేనేమి చిన్నప్పటి నుండి అలవాటు కావడంవల్ల వాటిలోని అవినీతి స్ఫురించక మనము వాటి నిర్మూలనకు పూనుకోము.

1927–28 ప్రాంతాలలో నేను బెజవాడలో వుంటూండగా శ్రీ తుర్ల పాటి వెంకటేశ్వరరావుగారు, వారి భార్య శ్రీ రాజేశ్వరమ్మగారు, నేను, నా భార్య అన్నపూర్ణమ్మగారలకు గాఢమైత్రి ఏర్పడింది. సాంఘిక విషయాల్లో మా అందరి అభిప్రాయాలు కలిసేవి. ముఖ్యంగా స్త్రీల కష్టాలను తొలగించుట లోను, స్త్రీల అంతస్థులను వృద్ధిపరచుట లోను మే మందరం కలసి పనిచేస్తూండే వాళ్ళం. శ్రీ వెంకటేశ్వరరావుగారు, నేను విదేశాల్లో ఉన్నతమైన నాగరికతకు అలవాటుపడ్డ వాళ్ళము. మా భార్యలను అభివృద్ధికి తెచ్చి దేశసేవ, సంఘ సేవ చేయగల సామర్ధ్యం వచ్చేలా ప్రయత్నించాము. అఖిలభారత మహిళా సంఘాలల్లో పాల్గొనుట, స్త్రీలకు క్లబ్బును స్థాపించి

మధ్యతరగతి విద్యావంతుల సమస్యలను పరిష్కరించుట బెజవాడలో రాజేశ్వరమ్మ, అన్నపూర్ణమ్మగార్లకు దినచర్య అయింది. వారిద్దరికి మేము వెనకనుండి సహాయంచేస్తూ, సంఘంలో ముందుకు నెట్టుకుపోతూ వచ్చాము. వారు తరచుగా కలుసుకొని పనిచేయవలసిన సందర్భం ఏర్పడింది.

ఒకరోజున వారిద్దరు రైవస్‌కాలువ గట్టున షికారు వెళ్ళారు. కొంతసేపటికి ఏడుస్తూ నావద్దకు వచ్చారు వారిదుఃఖానికి అంతంకనపడలేదు. "ఎవరో శిశువును కనగానే గొంతు నులిమి చంపి, కాలువ గట్టున పారవేశారు. ఆ మృత శిశువును కాకులు, గద్దలు తింటూండగా చూచి దుఃఖం భరించలేక ఏడుస్తూ వచ్చారు. ఎవరో వితంతువు ఆపని చేసి వుంటుందని వారి నమ్మకం. "ఎలా ఈ పాపాన్ని అరికట్టడం?" అని వారి ఆవేదన. సాధ్యమేనని నేను సలహా ఇచ్చాను. వారి దుఃఖం కొంతవరకుపశమించింది. గర్భవతులైన వితంతువులు రహస్యంగా ప్రసవించుటకు, బిడ్డలను ఇచ్చివెళ్ళుటకు ఒక సంస్థను స్థాపితచవచ్చు. తద్వారా వారి కష్టాలను తొలగించగలమని వివరంగా చెప్పాను. ఆ సంస్థను తాను నిర్వహించుతానని శ్రీ రాజేశ్వరమ్మగారు ప్రమాణం చేశారు. ఆర్థికంగా నేను సహాయపడతానన్నాను. ఆ రాత్రికే మేము నలుగురమూ, అడ్వొకేటు శ్రీ రాజేశ్వరరావుగారు కూడ కలుసుకున్నాము. సంస్థను నిర్వహించుటకు అవసరమైన నియమావళిని తయారుచేశాము. వెంటనే తాత్కాలికంగా శ్రీ తుర్లపాటివారి ఆవరణలో వుండే చిన్నయింట్లో వితంతు శరణాలయాన్ని స్థాపించాము. రాజేశ్వరమ్మగారు సూపర్నెంటు, నేను ప్రెసిడెంటు, మిగిలిన ముగ్గురు నిర్వాహక సంఘ సభ్యులు. మేము వెంటనే ఇతరుల సహాయాన్ని తీసుకోలేదు. "ఆంధ్రపత్రిక" లో ప్రచురించాము. శ్రీ నాగేశ్వరరావు పంతులుగారు సనాతనులైనా దయాదాక్షిణ్యరాసి, బాగా ప్రచారం జరిగింది. వెంటనే ఒకరిద్దరు గర్భిణీస్త్రీలు వచ్చారు. వారి పేర్లుగాని, చిరునామాలుకాని తెలుసుకో కూడదనిన్ని, తెలిస్తే రహస్యంగా వుంచాలనీ తీర్మానించుకున్నాం. ఖర్చు అంతా రాజేశ్వరమ్మగారే భరించారు; ఆ విధంగా షుమారు అరవై మందికి ఉపయోగపడింది. బెజవాడలోని స్త్రీ డాక్టర్లు–ముఖ్యంగా చలంగారి వదినెగారు డాక్టరు రంగనాయకయమ్మగారు సహాయం చేశారు. మా సంస్థలో బిడ్డలను పెంచుటకు తగిన ఏర్పాట్లు చెయ్యలేక పోయాము. అయితే, బిడ్డలులేని తల్లిదండ్రులు ఎప్పటి కప్పుడే పిల్లల నిమ్మని వచ్చేవారు.

## పిల్లలు కావాలి!

మనదేశంలో వేశ్యావృత్తిలో వుండేవారు సాధారణంగా ఆడపిల్లలను కొని, వారిని తమ వృత్తిలోదించి, ఆ విధంగా ధనమార్జించి జీవించుతారు. మా శరణాలయంలోని శిశువులను అలాంటి వారి హస్తగతం కాకుండా జాగ్రత్త పడవలసి వచ్చింది. రాజేశ్వరమ్మగారికో, వెంక

శేశ్వరరావుగారికో బాగా పరిచయమున్న వారికి మాత్రమే శిశువులను ఇచ్చారు. భుక్తికి లోటులేనివారికి, అనాధ శిశువులను పెంచుకొని; ఆ విధంగా తమకు బిడ్డలులేని లోటును పూర్తిచేసుకొన గోరినవారికే ఇచ్చారు. శిశువులకు గిరాకీ ఎక్కువగానే వున్నది. ముందుగానే రాజేశ్వరమ్మగారితో చెప్పుకొని, బ్రతిమలాడి ఒప్పించుకొని వెళ్ళేవారు. శరణాలయాన్ని స్థాపించే టప్పుడు అలాంటి డిమాండు మన సంఘంలో వుందన్న విషయం మాకు తెలియనే తెలియదు. ఈ అనుభవం మా కెంతో ఆశ్చర్యాన్ని కలిగించింది. అలాంటి శిశువులిప్పుడు 10 సంll ల నుండి 20 సంll ల వయసుగలవారు 60 మంది బెజవాడలో పెరుగుతున్నారు.

ఒక బిడ్డను శ్రీ రాజేశ్వరమ్మగారే పెంచుకున్నారు. ఆ బిడ్డ పేరే ఆ సంస్థకు పెట్టాము. కానీ, ఆ బిడ్డ పసితనంలోనే చనిపోయింది. నేను మద్రాసుకు వచ్చిన తరువాత నా రెండవ భార్య సుభద్రమ్మ గారు ఈ ఉద్యమాన్ని అతిసమర్థతతో ఉత్సాహంగానిర్వహించింది. బెజవాడ ప్రాంతంలోని స్త్రీలు తమ రహస్యం దాగదనే భయంతో అక్కడి సంస్థలో చేరుటకు ఇష్టపడేవారు కాదు. అట్టివారికి మద్రాసులో సుభద్రమ్మగారు వసతి కల్పించారు. ఈ విషయంలో ఉపాధ్యాయిని మిసెస్ పీటర్సుగారు ఎంతో తోడ్పడ్డారు. అనాధ స్త్రీలకు సహాయం చేయుటకు ఆమెగా రెన్నడూ నిరాకరించలేదు. అలాంటి పిల్ల లను అమిత ప్రేమతో పెంచుకొన్న మహా తల్లి ఆమె.

## ఏనుగ వెళుతూంటే...

మా కీ ఉద్యమ సందర్భంలో సంఘం అడ్డురాలేదు. కొందరు వ్యక్తులు హేళన చేసేవారు. వారి అంతస్థు మాకు తెలుసు. వారివి సంకుచిత హృదయాలు; సాంప్ర దాయాలకు లొంగిపోయిన వ్యక్తుల శుష్కవాదనలను మేము లక్ష్యపెట్టలేదు. ఏనుగులు వెళ్ళుతూంటే కుక్కలు మొరగవూ! ఈ విషయంలో మా అందరి కంటే హేళనకు విమర్శకు గురియైన వారు రాజేశ్వరమ్మగారు. శిశువులను ముద్దాడి, పెంచి, పెద్దచేసిన దయార్ద్ర హృదయంగల ఆ తల్లి పై కష్టాలను లక్ష్య పెట్టలేదు.

## సన్మార్గానికి

ఈ సమస్య అంతటితో అంతం కాలేదు. పతితస్త్రీల జీవితాలను బాగు చెయ్యడం ఎలాగు? మళ్ళీ అలాంటి తప్పులు చెయ్యనివ్వకూడదు. చదువు కొని, జీవనాధారమును సంపాదించుకో గలిగి, తమ కాళ్ళమీద తాము నిలబడి, వివాహం చేసుకొని సంఘంలో గౌరవంగా జీవించేలా చెయ్యాలి. ఇది చాలా కష్టమైన పనే. అయినా నేను, మరి కొందరు కలిసి అందుకు పూనుకొన్నాము.

అభ్యుదయవాదులు, సంస్థలవల్ల ఎంతో సహాయం లభించింది. సర్ ముత్తా వెంకటసుబ్బారావుగారు, వారి సతీమణి ఆండాళ్ళమ్మగారు తమ సేవాసదనంలో మేము పంపిన వారందరికీ ఖర్చులన్నిటిని తామే భరించి వృద్ధికి తెచ్చారు. మిసెస్

పీటర్సు తన మాంటిసోరి స్కూలులో ఆశ్రయమిచ్చినది. డాక్టరు ముత్తులక్ష్మి రెడ్డిగారు తన అవ్వాయి హోంలో కొందరికి సహాయం చేశారు. రాజమండ్రి నాళం రామలింగయ్యగారి సంస్కృత కళాశాల ప్రిన్సిపాలు బత్తుల కామాక్షమ్మ గారి సానుభూతితో కొందరు వృద్ధికి వచ్చారు. కొందరు టీచర్లుగను, మరికొందరు నర్సులుగను, కొందరు విద్వాంసులు, ఉభయభాషా ప్రవీణులు, సంగీత శాస్త్రజ్ఞులుగాను తయారైనారు. ఉద్యోగాలలో చేరి, గౌరవంగా జీవిస్తూ, వివాహాలు చేసుకొని భర్తలతోను, బిడ్డలతోను సుఖంగా వుంటున్నారు.

ఆ కాలంలోనే మద్రాసులో అఖిల భారత మహిళాసంఘం వారి సహాయంతో ఒక రక్షణ గృహము స్థాపించ బడినది. దానిని ముఖ్యంగా శ్రీ ముత్తు లక్ష్మిరెడ్డిగారు, శ్రీ అమ్ము స్వామినాథన్ గారు, నా భార్య సుభద్రమ్మగారు చాలా ఉత్సాహంతో కొన్ని సంవత్సరాలపాటు నిర్వహించారు.

అయితే మావద్ద సహాయం పొందిన వారందరు బాగుపడ్డారా? లేదు. కొద్దిమంది బాగుపడనేలేదు. ✦

( ఇంకా ఉంది )

✦ మా అందరి శక్తికి లొంగని ఒకామెను గురించి వ్రాయటం సమంజస మనుకుంటాను. ఒక హిందూస్త్రీ ఒక ముసల్మాను యింట్లో బాధపడుతున్నదనీ, ఆమెను రక్షించమనీ నా మిత్రులు కోరారు. సరేనని ఆ యింటికి వెళ్లాను. "లోపలికి పోవద్దు, చంపేస్తాడేమో"నని మిత్రులు నివారించారు. నేను లోపలికెళ్ళి ఇద్దరితో మాట్లాడాను. ఇద్దరూ వివాహం చేసుకొని సుఖంగా వుండమని బోధించాను. ఆవిడ ఒప్పుకోలా. నాతో వచ్చి చదువుకొని బాగుపడతానని బ్రతిమలాడింది. అతను వదలి పెట్టడానికి సమ్మతించలేదు. పోలీసు డెప్యూటీ సూపర్నెంటు సహాయంతో ఆమెను తీసుకెళ్ళి బెజవాడలో నా ప్రథమ భార్య అన్నపూర్ణమ్మకు ఒప్పగించి తమాషాకు "నీ గట్టితనం చూస్తాను ఈవిడను బాగుచెయ్యి" అన్నాను. "తప్పకుండా బాగవుతుంది" అని ధీమాగా జవాబు చెప్పినది. కొన్ని వారాలకు అన్నపూర్ణ "ఆ స్త్రీ నా బోధవల్ల బాగుపడుతుందనే నమ్మకం ఎంత మాత్రం లేదు. పైగా ఆవిడ బోధవల్ల నేనే చెడిపోతానేమోనని భయంగా వుంది. ఆమె విషయం ఎలావున్నా మీ భార్య విషయంలో జాగ్రత్తపడం"డని చమత్కారంగా రిపోర్టు పంపింది.

ఆ స్త్రీ కథ విపులంగా ఒక ఉత్తరంలో శ్రీ ముత్తా వెంకట సుబ్బారావుగారి భార్యకు వ్రాసి, "మీ సామర్థ్యాన్ని పరీక్షించటానికి మీ వద్దకు పంపుతా"నని స్నేహ పూర్వకంగా వ్రాశాను. ఆమె అంగీకరించి, తన సేవా సదనంలో చేర్చుకొని ఎంతో ప్రయత్నించిరి. కాని, ఆమెకూ సాధ్యంకాలేదు. తీసుకెళ్ళమని నాకు వ్రాయకముందే తన ముసల్మాను ప్రియుని వద్దకు చేరిపోయింది ఆ పడుచు. మే మందరం ఎంతో వ్యసన పడ్డాము! కాని ఏం ప్రయోజనము?

# [illegible] - క్యాలెండరు

( 1994 జూన్ 21 నుండి 1994 జూలై 20 వరకు )

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదివారము | | 26 | 3 | 10 | 17 |
| సోమవారము | | 27 | 4 | 11 | 18 |
| మంగళవారము | 21 | 28 | 5 | 12 | 19 |
| బుధవారము | 22 | 29 | 6 | 13 | 20 |
| గురువారము | 23 | 30 | 7 | 14 | |
| శుక్రవారము | 24 | జూలై 1 | 8 | 15 | |
| శనివారము | 25 | 2 | 9 | 16 | |

జూన్ 22 :- ఆరుద్ర కార్తె రాత్రి 1-58 ని.

జూన్ 30 :- వ్యాపారరీత్యాకానీ, వృత్తిరీత్యాకానీ ఆదాయముగల ఆసెసీలు తమ ఆదాయపు పన్ను రిటర్న్సును అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి చేర్చుటకు ఆఖరు తారీఖు.

జూన్ 30 :– ఆదాయపు పన్ను చట్టములోని 19 A విభాగము క్రింద సెక్యూరిటీల మీద వచ్చు వడ్డీలు కాక ఇతర వడ్డీల విషయంగా పట్టుకొన్న మొత్తము వివరాలను తెలుపు ఆన్యువల్ రిటర్న్ ఫారము నెం 26 A ను అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి చేర్చుటకు తుది రోజు.

జూన్ 30 :– ఆదాయపుపన్ను చట్టములోని 193 విభాగము క్రింద సెక్యూరిటీల ద్వారా వచ్చు వడ్డీలను పట్టుకొన్న మొత్తము వివరాలను తెలుపు ఫారము నెం 25 ను అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి చేర్చుటకు చివరి తారీఖు.

జూన్ 30 :– ఆదాయపుపన్ను చట్టములోని 194 C విభాగము క్రింద కాంట్రాక్టర్లు సబ్ కాంట్రాక్టర్లకు చేసిన చెల్లింపుల విషయంగా, పట్టుకొన్న మొత్తము పన్ను వివరాలను తెలుపు ఆన్యువల్ రిటర్న్ ఫారము నెం 26 C ని అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి పంపుటకు చివరిరోజు.

జూన్ 30 :– ఆదాయపు పన్ను చట్టములో 194 D విభాగము క్రింద ఇన్సూరెన్సు కమీషన్ విషయంగా తగ్గించుకొన్న మొత్తము పన్ను వివరాలను తెలుపు ఆన్యువల్ రిటర్న్ ఫారము నెం 26 D ని అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి చేర్చుటకు కడపటి తారీఖు.

జూన్ 30 :– ఇన్సూరెన్సు కమీషన్‌కు సంబంధించి ఆ సంవత్సరములో వ్రాసుకొన్న వివరాలను తెలుపు ఆన్యువల్ రిటర్న్ ఫారము నెం 26 E ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్ను అధికారికి చేర్చుటకు కడపటి తేది.

జూలై 6 :– పునర్వసు కార్తె రాక ప 3–43 ని.

జూలై 15 :– పి.యస్.టి. ఫారాన్ని రెండు కాపీలుగా అందులో చూపబడిన మేరకు కట్టవలసిన అమ్మకం పన్నుకు సంబంధించిన డిమాండు డ్రాఫ్టుతో అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారికి చేర్చుటకు ఆఖరు తేది.

జూలై 15 :– చెక్కు ద్వారా అమ్మకం పన్నును చెల్లించు అసెసీలు, చెక్కుతోబాటు A-2 రిటర్నును అందుకు సంబంధించిన అమ్మకంపన్ను అధికారికి చేర్చుటకు ఆఖరు తేది.

జూలై 17 :– దక్షిణాయన పుణ్యకాలము   జూలై 19 :– తొలి ఏకాదశి.   జూలై 20 :– పుష్యమి కార్తె రాక సాయంత్రం 5 గంటలకు

జూలై 20 :– A-2 రిటర్నును చలానాతో బాటు అందుకు సంబంధించిన అమ్మకంపన్ను శాఖాధికారికి చేర్చుటకు చివరి తేది.

**26, 3, 10, 17 ఆదివారాలు**

---

నన్ను మీ టేబులుపై ఉంచుకోండి. ఈ నెల అంతా మీకు కర్తవ్యాన్ని గుర్తు చేస్తుంటాను.

# శ్రీశైలక్షేత్ర నగర ఆల్ ఇండియా ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం, శ్రీశైలము.

( రిజిష్టర్డు నెం. 25/1960 కర్నూల్ )


టెలిగ్రాం అన్ని చోట్ల "VASAVI"

టెలిఫోన్ నెంబరు : మార్కాపురం : 2595, శ్రీశైలం : 3140, 3114, పుట్టపర్తి : 2040, తిరుమల : అప్లైడ్.


## వైశ్యయాత్రీకులకు విజ్ఞప్తి

పై సంఘము ద్వారా నాలుగు క్షేత్రములలో సత్రములు కట్టించి అన్ని రకములైన వసతులు ఏర్పాటు చేసి, శాశ్వతముగా, ఉచిత వసతి, నిత్య భోజనములు ఏర్పాటు చేయులాగున తీర్మానించినాము.

1. వాసవీ సత్రం, శ్రీశైలం :– 128 టాయిలెట్ ఫర్నిచర్ కలిగిన రూములు, 4 పెద్ద హాల్సు, పూర్తిగా తయారుచేసి 25-12-62 నుండి నిత్యభోజనములు ఏర్పాటు చేసినాము. ప్రతి సం॥లో ఒక లక్షయాభై వేల మంది వైశ్యులు ఉచిత వసతి, భోజన సౌకర్యములు అనుభవించుచున్నారు. ఇందులకై విరాళములు రూ.1116.00 లు శాశ్వత సభ్యత్వం. ఇందుకు వచ్చు వడ్డీ మాత్రం అన్నదానమునకు ఖర్చు చేయబడును. దాత ఫోటో, పేరు వేయబడును. దాత కోరిన రోజు భోజన ఉభయం జరుపబడును.

   రెండవ అంతస్తులో 37 రూములు కట్టుచున్నాము. 30×10 రూము రూ.30,000/-, 15×7 రూముకు రూ.20,000/- అగును. రూము విరాళంయిస్తే దాతకు సం॥లో 30 రోజులు ఇవ్వబడును.

2. వాసవీ నివాస్, పుట్టపర్తి : 2 ఎకరంల స్థలములో నిర్మాణం చురుకుగా సాగుచున్నది. 75 రూములు తయారై యాత్రికులకు ఉచితంగా ఇచ్చు చున్నాము. సాధ్యమైనంత త్వరలో పూర్తిగా అన్ని వసతులతో నిర్మాణం చేసి, నిత్య భోజనములు ఏర్పాటు చేయుటకు ప్రయత్నములు త్వరలో జరుగుచున్నవి. స్థాపకులు శాశ్వత సభ్యత్వం రూ.2116.00 వారి పేరు, ఫోటో కూడా సత్రములో వేయించబడుతుంది. రూ.80,000 యిచ్చిన యెడల వారి పేరుతో 30×15 రూమ్ నిర్మించబడుతుంది. 10×25 రూమ్‌కు రూ.50,000 ఇచ్చిన యెడల దాత ఫోటో, పేరు రూములో వేయబడును. దాతకు 100 రోజులు రూము యివ్వబడును. మిగతా రోజులు యాత్రీకులకు యివ్వబడును.

3. <u>వాసవీ భవన్, తిరుమల</u> : తిరుమలలో నిర్మించనున్న నాలుగు అంతస్తుల భవనపు పనులు చురుకుగా సాగుచున్నవి. రెండు హాల్సు 52×100 అడుగులవి (ఒక సెల్లరు, ఒక గ్రౌండు) నిర్మాణములో కలవు. సదరు హాల్సుకు ఈ క్రింది విధంగా డోనేషన్లు స్వీకరించబడును.

I&II ఫ్లోరు రూము డోనార్సు : 10 రూములకు పరిమితము. ఒక లక్ష రూపాయలు విరాళము నొసగు దాతలకు సంవత్సరంలో 30 రోజులు రూము యివ్వబడును. వారి ఫోటో శిలా ఫలక రూములో వేయబడును.

హాల్సు డోనార్సు : 52×10 అడుగుల ఒక అంకణము హాలుకు లక్షరూపాయలు విరాళము నొసగు దాతలకు రూము డోనార్ల మాదిరిగా పరిగణించి సంవత్సరములో 30 రోజులు ఉచితంగా యివ్వబడును. 20 అంకణములు పరిమితం.

మహారాజ పోషకులు : 400 మంది సభ్యులకు పరిమితము. పది వేల రూపాయలు నొసగు దాతలకు సంవత్సరములో ఐదు రోజులు రూము యివ్వబడును. ఫోటో శిలా ఫలకము వేయబడును. వంశ పారంపర్యంగా సభ్యత్వం వుండును.

రాజ పోషకులు : 400 మంది సభ్యులకు పరిమితము. ఆరు వేల రూపాయలు నొసగు దాతలకు సంవత్సరములో మూడు రోజులు రూము యివ్వబడును. నాపరాయిపైన పేరు వేయబడును. వంశ పారంపర్యంగా సభ్యత్వం వుండును. "వాసవీ భవన్, తిరుమల"కు కార్యదర్శి కార్యాలయం, మార్కాపురం అని వ్రాసి ముందుగా పంపు వారి DD మాత్రమే ఆమోదించబడును. చెక్కులు పంపవచ్చును. కాని ఆ చెక్కులు చెల్లివచ్చినప్పుడే సీరియల్ లోకి వచ్చును. అవకాశము లేని వారి పైకము తిరిగి వాపసు పంపు అధికారం సంఘమునకు కలదు. DD లు మార్కాపురం, స్టేటు బ్యాంకు, వైశ్యా బ్యాంక్, సిండికేట్ బ్యాంక్ లపై పంపగోర్తాము. త్వరలో తిరుమలలో ఆఫీసు ఓపెన్ చేస్తాము. అంతవరకు పై అడ్రసుకు పంపకోర్తాము.

4. <u>వాసవీ విలయం, పెనుగొండ</u> : పరిశీలనలో ఉంది.

5. <u>వాసవీ ఆర్యవైశ్య బీద విద్యార్థి నిధి</u>

మన సంఘము ద్వారా నిరుపేద వైశ్యుల విద్యాభివృద్ధి నిమిత్తం మూల ధనం ఏర్పాటు చేసి అందులకు రాబడు వడ్డీని నిరుపేద వైశ్యుల అప్లికేషన్లు తీసుకొని అందులో విద్యార్హతలు ఎక్కువ గల వారికి సహాయము చేయులాగున తీర్మానించినాము.

ఒక వైశ్యుడు మరొక వైశ్యునకు డైరెక్టుగా సహాయం చేసి బాగుపరచే విధానం శూన్యంగా యున్న ఈ సమయంలో ఒక నిరుపేద విద్యార్థిని చదివించి ఉత్తీర్ణుడిని చేస్తే ఆ బీద విద్యార్థి ఇతరులకు సహాయము చేయకున్నా అతని సంతతికి అనగా కొడుకులు మనుమలు వరుసగా చదివించుకొని బాగుపడుదురుగదా! ఆలా సహాయము జరుగకున్న ఆ బీద విద్యార్థి చదువు లేక అతని వంశ మంతయు నిరుపేద లౌతారుగదా. కాబట్టి ఈ

పద్ధతి పూర్తిగా సాగి నిరుపేదలు చదివితే కొన్ని సంవత్సరములకైన మన వైశ్యులు విద్యావంతులై గవర్నమెంటులోనో, ప్రవేటు సంస్థల్లోనో, వ్యాపారంలోనో, ఇండస్ట్రీస్ ద్వారానో అభివృద్ధి చెందగలరు. కాన సర్వేశ్వరుడు తమకు కలుగ జేసిన ధనములో ఈ క్రింది విధంగా విరాళముల నొసంగ ప్రార్థన.

ఒక లక్షరూపాయలు సమర్పించిన వారి ఫోటో నాలుగు సత్రములలో వేయబడును. వారి పేరు నాపరాయి పైన నాలుగు సత్రములలో వేయబడును. వీరికి వంశపారంపర్య సభ్యత్వం కలదు. వీరికి సంవత్సరములో 25 రోజులు ప్రకారం అన్ని సత్రములలో రూము కేటాయించబడును.

రు.10116.00 సమర్పించినవారు మహారాజ పోషకులు. యీ సంఘమున వంశపారంపర్య సభ్యులు. వీరి ఫోటో మన సంఘము నిర్వహించు అన్ని సత్రములలో వేయబడును. వీరి పేరు కూడా అన్ని సత్రములలో నాపరాయి పైన చెక్కించబడును.

రు.5116.00 సమర్పించిన రాజపోషకులు. వీరికి వంశపారంపర్యంతం సభ్యత్వం కలదు. వీరి ఫోటో దాత కోరిన మన సత్రములలో రెండు చోట్ల వేయబడును. వీరి పేర్లు అదే రెండు సత్రాలలో నాపరాయిపైన చెక్కబడును.

రు.2116.00 సమర్పించిన వారు పోషకులు. వీరికి వంశపారంపర్య సభ్యత్వం. వీరి ఫోటో దాత కోరిన ఒక సత్రములో వేయబడును. వీరి పేరు నాపరాయి పైన అదే సత్రములో వేయబడును.

రు.1116.00 సమర్పించిన వారు సభ్యులు. వీరికి వంశ పారంపర్య సభ్యత్వం కలదు. వీరి పేరు దాత కోరిన ఒక సత్రములో నాపరాయిపైన వేయబడును.

పై ధనమునకు వచ్చిన వడ్డీ పంపకం కమిటీ తీర్మానం ప్రకారం నిరుపేద వైశ్య విద్యార్థులలో మెరిట్ కల వారికి పంచబడును.

6. వాసవీ అష్టోత్తర శతహోమకుండ వార్షిక మహా క్రతువు రాబోవు నవంబరులో పుట్టపర్తిలో పెట్టుటకు ఏర్పాట్లు చేయుచున్నాము.

:- ప్రత్యేక ఉత్తర ప్రత్యుత్తరములకు :-

మూర్తి వెంకటేశ్వర్లు, వాసవీ సత్రముల కార్యదర్శి కార్యాలయం,

మార్కాపురం - 523 316. ప్రకాశం జిల్లా, ఆంధ్ర ప్రదేశ్.

అధ్యక్షులు : ఆత్మకూరు నాగభూషణం శ్రేష్ఠి, నంద్యాల.

N.B :- పై సత్రముల పేరుతో - D.D. లు కాని, చెక్కులుకాని పంపకోర్తాము. ఎవరు అడిగినను డబ్బు యివ్వవద్దు. కొంతమంది దొంగలు డబ్బు వసూలు చేయుచున్నారు. గ్రహించకోర్తాము.

# ద్వాదశ రాశులు – స్వరూప విశ్లేషణము

రచన : శ్రీ సత్రసాల వేణుగోపాల్, బి.ఎ., ధర్మవరము.

ప్రకృతి, పురుషుల యొక్క జనన జీవన స్రవంతి ద్వాదశ రాశుల "భ" చక్రమునకు లోబడి వుండుననుట శాస్త్ర సమ్మతము. దినగతి, జనగతి, స్వరూప స్వభావాలు సహా ద్వాదశ రాశులకు లోబడి మనుగడ సాగించుచుండును.

మేషము మొదలు మీనము వరకు గల రాశులే ద్వాదశ రాశులని పిలువబడును.

కాల పురుషునకు మేషము శిరస్సు, వృషభము ముఖము, మిధునము వక్ష స్థలము, కర్కాటకము హృదయము, సింహము ఉదరము, కన్య కటి ప్రదేశము, తుల నాభి అనగా క్రింది ప్రదేశము, వృశ్చికము మర్మాంగము, ధనస్సు తొడలు, మకరము మోకాళ్ళు, కుంభము పిక్కలు, మీనము పాదములు, పై విధముగా కాల పురుషునకు ద్వాదశ రాశులు అవయవములు అగుచున్నవి.

పై ద్వాదశ రాశులలో మేషము, వృషభము, మిధునము తూర్పు దిక్కునను; కర్కాటకము, సింహము, కన్య యీ మూడు రాశులు దక్షిణ దిక్కునను; తుల, వృశ్చిక, ధనస్సులు యీ మూడు రాశులు పడమటి దిక్కునను; మకరము, కుంభము, మీనమును యీ మూడు రాశులు ఉత్తర దిక్కునను వుండును. ప్రయాణ విషయములందు యీ దిక్కులను గమనించుట చాలా ముఖ్యము.

తూర్పునకు మేషము, సింహము, ధనస్సు; దక్షిణ దిక్కునకు వృషభము, కన్య, మకరము; పడమటి దిక్కునకు మిధునము, తుల, కుంభములు; ఉత్తరమునకు కర్కాటక, వృశ్చిక, మీనములు ఆధిపత్యములు కలిగి వున్నవి.

ద్వాదశ రాశులకు లగ్న ప్రమాణము స్థూలముగా యీ క్రింది విధముగా వుండును. ఈ ప్రమాణములు సహా దేశాంతర భేదమునననుసరించి పంచాంగ కర్తలు తెలుపుచుండుట సహజము.

| రాశులు | లగ్న ప్రమాణ ఘడియలు |
|---|---|
| మీనము, మేషము | 4 ఘడియలు |
| వృషభము, కుంభము | 4–30 ఘడియలు |
| మిధునము, మకరము | 5–15 ఘడియలు |
| కర్కాటకము, ధనస్సు | 5–30 ఘడియలు |
| వృశ్చికము, సింహము | 5–30 ఘడియలు |
| తుల, కన్య | 5–15 ఘడియలు |

గమనిక :– 1. మేషము, వృషభము, మిధునము, కర్కాటకము, ధనస్సు, మకరము యీ ఆరు రాశులు రాత్రులందు బలం కలవి.

2. సింహము, కన్య, తుల, వృశ్చికము, కుంభము యివి పగలు బలము కలవి.

3. మీనము రాత్రి, పగలు బలము కలిగి ఉన్నట్టిది.

## ద్వాదశ రాశుల ఆకార తత్వ స్వభావములు

| రాశులు | ఆకారము | చరస్థిర స్వభావము | తత్వము | జల, నిర్జలము |
|---|---|---|---|---|
| 1. మేషము | మేక ఆకారముగా వుండును. | చర రాశి | అగ్ని | పాద జల రాశి |
| 2. వృషభము | ఎద్దు ఆకారము | స్థిరము | భూత | అర్ధ జల రాశి |
| 3. మిధునము | వీణ ధరించిన స్త్రీ గద ధరించిన పురుషుడు | ద్వి స్వభావము | వాయు | నిర్జలము |
| 4. కర్కాటకము | యెండ్రికాయ వలె | చర రాశి | జలము | పూర్ణ జల రాశి |
| 5. సింహము | సింహము ఆకారము | స్థిర రాశి | అగ్ని | నిర్జలము |
| 6. కన్య | 16 సంవత్సరముల కన్య | ద్వి స్వభావి | భూత | నిర్జల రాశి |
| 7. తుల | త్రాసు ధరించిన పురుషుడు | చర రాశి | వాయు | పాద జల రాశి |
| 8. వృశ్చికము | తేలు ఆకృతి | స్థిర రాశి | జల | పాద జల రాశి |
| 9. ధనస్సు | బాణము ధరించిన పురుషుడు | ద్వి స్వభావి | అగ్ని | అర్ధ జల రాశి |
| 10. మకరము | మొసలి వలె ఉండును. | చర రాశి | భూత | పూర్ణ జల రాశి |
| 11. కుంభము | భుజము నందు కడవ ఎత్తుకున్న పురుషుని వలె | స్థిర రాశి | వాయు | అర్ధ జల రాశి |
| 12. మీనము | నీటియందు సంచరించు రెండు చేపల వలె | ద్వి స్వభావి | జల | పూర్ణజలరాశులు |

## ద్వాదశ రాశుల జాతి స్వభావ నైజములు

| రాశులు | స్వభావము | లింగము | జాతి | స్వభావరాశి | అధిపతి |
|---|---|---|---|---|---|
| 1. మేషము | క్రూర | పురుష | క్షత్రియ | పశు | కుజుడు |
| 2. వృషభము | సౌమ్య | స్త్రీ | బ్రాహ్మణ | పశు | శుక్రుడు |
| 3. మిధునము | క్రూర | పురుష | వైశ్య | నర | బుధుడు |
| 4. కర్కాటకము | సౌమ్య | స్త్రీ | శూద్ర | జల | చంద్రుడు |
| 5. సింహము | క్రూర | పురుష | క్షత్రియ | పశు | రవి |
| 6. కన్య | సౌమ్య | స్త్రీ | శూద్ర | నర | బుధుడు |
| 7. తుల | క్రూర | పురుష | వైశ్య | నర | శుక్రుడు |
| 8. వృశ్చికము | సౌమ్య | స్త్రీ | బ్రాహ్మణ | కీటక | కుజుడు |
| 9. ధనస్సు | క్రూర | పురుష | క్షత్రియ | నర | గురువు |
| 10. మకరము | సౌమ్య | స్త్రీ | శూద్ర | జల | శని |
| 11. కుంభము | క్రూర | పురుష | వైశ్య | నర | శని |
| 12. మీనము | సౌమ్య | స్త్రీ | బ్రాహ్మణ | జల | గురువు |

సూచిక :- రాహువు కన్యా రాశికి, కేతువు మీన రాశికి అధిపతులు.

నవ గ్రహములు పై ద్వాదశ రాశులందు సంచరించునపుడు పై ద్వాదశ రాశులు కొన్ని మిత్ర క్షేత్రములుగను, కొన్ని శత్రు క్షేత్రములుగను, మరికొన్ని సమ క్షేత్రములు గను జాతకుని చక్రమునందు నిర్దేశితమై శుభా శుభ ఫలితములను జాతకునకు కల్పించి, వాని జీవిత చక్రమును నడిపించుచుండును. ఆ గ్రహ రాశులను ఒక పరి వీక్షించిన విషయము పాఠకులకు అవగతము కాగలదు.

**గ్రహములకు మిత్ర, శత్రు, సమ, రాశుల పట్టిక**

| గ్రహములు | మిత్ర రాశులు | శత్రు రాశులు | సమ రాశులు |
|---|---|---|---|
| 1. రవి | మేషము, కర్కాటకము, కన్య, వృశ్చికము, ధనస్సు, మీనము | వృషభము, తుల, మకరము, కుంభము | మిథునము |
| 2. చంద్రుడు | మేషము, మిధునము, సింహము, కన్య, ధనస్సు, మకరము, కుంభము | తుల | మీనము, వృషభము |
| 3. కుజుడు | వృషభము, సింహము, ధనస్సు, కర్కాటకము | మిధునము, కన్య, కుంభము | తుల, మీనము |
| 4. బుధుడు | మేషము, వృషభము, సింహము, తుల, ధనస్సు, మకరము | కర్కాటకము | వృశ్చికము, కుంభము, మీనము |
| 5. గురువు | మేషము, సింహము, వృశ్చికము, మకరము | వృషభము, మిధునము, కన్య, తుల | కుంభము |
| 6. శుక్రుడు | మిధునము, కన్య, వృశ్చికము, కుంభము | కర్కాటకము,సింహము, ధనస్సు, మకరము | మేషము |
| 7. శని | వృషభము, మిధునము, కన్య, మీనము | మేషము, కర్కాటకము, సింహము, వృశ్చికము | ధనస్సు |
| 8. రాహువు | మేషము | తుల | -- |
| 9. కేతువు | తుల | మేషము | -- |

పై పట్టికను గమనించి రాశుల యొక్క ఆక్రమిత గ్రహముల యొక్క, బల నిర్ణయమును గమనించుట ఎంతయో ముఖ్యము.

ద్వాదశ రాశుల లగ్న నిర్ణయ సందర్భములందు మొదటి రాశిని అనగా లగ్నమును ధనుస్థాన మనియు, లగ్నమునకు రెండవది ధన స్థానమనియు, మూడు విక్రమ స్థానమనియు, నాలుగు మాతృ స్థానమనియు, ఐదు పుత్రస్థానమనియు, ఆరు రిపు స్థానమనియు, ఏడు కళత్ర స్థానమనియు, ఎనిమిది ఆయు స్థానమనియు, తొమ్మిది భాగ్య స్థానమనియు, పది కర్మ స్థానమనియు, పదకొండు లాభ స్థానమనియు, పన్నెండు వ్యయ స్థానమనియు వ్యవహరింతురు.

పై ద్వాదశ రాశులను కేంద్రములుగను, కోణములుగను, ఫణి ఫర, ఆపోక్లీభములుగను శాస్త్రవేత్తలు విభజించిరి.

## ద్వాదశ రాశులకు అధిపతులు – గ్రహముల వుచ్చ నీచల పట్టిక

| గ్రహము | గ్రహ అధిపతి | ఉచ్ఛ | నీచ | మూల త్రికోణం |
|---|---|---|---|---|
| 1. రవి | సింహము | మేషము | తుల | సింహము |
| 2. చంద్రుడు | కర్కాటకము | వృషభము | వృశ్చికము | వృషభము |
| 3. కుజుడు | మేషము, వృశ్చికము | మకరము | కర్కాటకము | మేషము |
| 4. బుధుడు | మిధునము, కన్య | కన్య | మీనము | కన్య |
| 5. శుక్రుడు | వృషభము, తుల | మీనము | కన్య | తుల |
| 6. శని | మకరము, కుంభము | తుల | మేషము | కుంభం |
| 7. గురువు | ధనస్సు, మీనము | కర్కాటకము | మకరము | ధనస్సు |
| 8. రాహువు | కన్య | మిధునం, వృషభం | ధనస్సు, వృశ్చికం | సింహం |
| 9. కేతువు | మీనము | ధనస్సు, వృశ్చికం | మిధునం, వృశ్చికం | కుంభం |

కేంద్రములనగా లగ్నము లగ్నము లగాయితు నాలుగవ స్థానము, ఏడవ స్థానము, పదవ స్థానము. కోణములనగా లగ్నము, లగ్నము మొదలు 5వ స్థానము, 9వ స్థానము.

ఫణి, ఫరములు అనగా లగ్నము లగాయితు రెండు, ఐదు, ఎనిమిది, పదకొండు స్థానములు. అపోక్లీభములు అనగా లగ్నము మొదలు 3, 6, 9, 12 స్థానములు. ఇట్లు ద్వాదశ రాశులను శాస్త్రవేత్తలు విభజించిరి. సాధారణముగా 6, 8, 12 స్థానములను పాప స్థానములని జ్యోతిశాస్త్ర వేత్తలు నుడువుదురు.

కేంద్రస్థానములందు గ్రహములు బలవత్తరముగను, ఫణిఫరములందు మధ్య బలముగను, అపోక్లీభములందు బలహీనముగను, సాధారణముగా వుండును అని కొందరి శాస్త్రవేత్తల అభిప్రాయము.

కేంద్రములను కంటకము లనియు, చతుష్టములనియు సహోపిలుతురు. యీ రాశులు వరుసగా కీటక, నర, జల చర, పశు రాశులైన పూర్ణ బలము కలిగి వుండును. కీటక రాశియగు వృశ్చికము సప్తమము అయినను నర రాశులగు మిధున, కన్య, తుల, ధనస్సు, కుంభములు లగ్నము లయినను జల రాశులగు కర్కాటక, మకర, మీనములు చతుర్ధ స్థానములయినన్ను, పశు రాశులగు మేషము, వృషభము, సింహము, దశమ స్థానములయినను బలము కలిగి వుండుట సహజము.

లగ్న బల నిర్ణయమును గమనించుట ఎంతయో ముఖ్యము. లగ్నము బుధ, గురులతో కూడినను, లేక బుధ గురులతో చూడబడినను, యితర గ్రహసంబంధము లేనియెడల బలము కలిగినదని గ్రహించుము.

లగ్నము బుధ గురులతో కూడినను, చూడబడినను, యితర గ్రహ సంబంధమున్న అది మధ్య బలము కలిగిన దనియు, గురు బుధుల సంబంధము ఎంత మాత్రము లేక యితర గ్రహములతో

కూడి కాని, చూడబడినను లగ్నము దుర్బలముగా వుండుట శాస్త్రసమ్మతము.

ద్వాదశ రాశులపై గ్రహ దృష్టి సహా తెలుసుకొనుట చాలా ముఖ్యము. శుభ గ్రహములయినను, పాప గ్రహము లయినను, తామున్న రాశికి ఏడవ రాశిని పూర్ణ దృష్టితో గ్రహములన్నియు చూచును. విశేషించి గురువు 5, 9 రాశులను, కుజుడు 4, 8 రాశులను, శని 3, 10 రాశులను చూచుచుందురు.

పై విధముగ నవ గ్రహములు ద్వాదశ రాశులను ఆక్రమించి దృష్టిలను ప్రసరించి, ప్రకృతి, పురుషుల జనన చక్రమును నడిపించుచుందురు. విశేషించి జనన కర్మను బట్టి మానవుని జన జీవనము కాల పురుషునికి ఆధీనమై మనుగడ సాగించును. ద్వాదశ రాశుల, స్వభావ, స్వరూపములను, క్షుణ్ణంగా, జాతక చక్రముపై గ్రహించి ఫల నిర్దేశమునకు పూనుకొన్న సత్ఫలితములను సాధించ వచ్చునని మహా బుషుల అభిప్రాయము.

## హరికథా విద్వాంసులు సుబ్బరాయ గుప్త మృతి

గుంటూరు జిల్లా ఈపూరు మండలం, పెదకొండాయపాలెం గ్రామకాపురస్థుడు, ప్రముఖ హరికథా విద్వాంసులు, శ్రీ కోట సుబ్బరాయగుప్త ది.27.5.1994వ తేదీన చనిపోయారు. ఈయన వయస్సు 63 సంవత్సరాలు. గత ఎనిమిది సంవత్స రాలుగా అనారోగ్యంతో బాధపడ్డారు. ఈయన గొప్ప కవి, రచయిత. రాష్ట్ర మంతటా, హరికథా కాలక్షేపంచేసి, ప్రజల్ని రంజింపజేశారు. గుప్తాకు పలు సాంస్కృతిక సంస్థలు, సన్మానాలు చేసి, 'కీర్తన కంఠీరవ', 'కవి వతంస', 'కవి తిలక', 'కళా భారతి', 'హరికథాగాన సామ్రాట్' మొదలగు బిరుదులు యిచ్చి సత్కరించాయి.

'ఈనాడు' (దినపత్రిక) 3.6.1994
(గుంటూరు ఎడిషన్)

సేకరణ
చుండూరి అప్పారావు, రావెల.

## అగస్త్యేశ్వరస్వామి దేవస్థాన ధర్మకర్తల మండలి అధ్యక్షులుగా శ్రీ వీరభద్రయ్య

కడప జిల్లా ప్రొద్దుటూరులోని సర్వ వర్తక సంఘాల సమాఖ్య అధ్యక్షులు శ్రీ వంకదార వీరభద్రయ్య గారు, సదరు పట్టణములోని శ్రీ అగస్త్యేశ్వరస్వామి దేవస్థాన ధర్మకర్తల మండలి అధ్యక్షులుగా 20.5.1994వ తేదీన ప్రమాణ స్వీకారం చేశారు. వీరితో బాటు శ్రీయుతులు పల్లవల్లి రామమోహన రెడ్డి, గువ్వల నారాయణ రెడ్డి, ఆర్.ఎస్. లీలా కుమారి, నందం ఈశ్వరయ్య, ఆరవేటి సత్యనారాయణ, అబ్బుగారి యర్రన్న గారలు ధర్మకర్తృత్వ మండలి సభ్యులుగా ప్రమాణ స్వీకారం చేశారు. ఈ సందర్భంగా జరిగిన సభలో ప్రొద్దుటూరు నియోజక వర్గ శాసనసభ్యులు శ్రీ నంద్యాల వరద రాజులు రెడ్డి గారు ముఖ్య అతిథిగా పాల్గొన్నారు.

# రామచరిత మానసం

( తులసీ రామాయణము )

తెలుగు సేత : శ్రీ గాదంశెట్టి శ్రీరాములు, యం.ఎ.

( గత సంచిక తరువాయి )

అప్పుడు రావణుడు పది ధనుస్సులు ఎక్కుపెట్టి బాణాలతో కొట్టి వాళ్లను గాయపరిచాడు. ఆంజనేయుడు మొదలగు వానర వీరులందరినీ మూర్ఛపోయేట్లు కొట్టి సాయంకాలం అయిందనుకొని సంతోషించాడు.

ఇంతలో సమస్త వానర వీరులంతా మూర్ఛితులైనట్లు చూసి రణధీరుడైన జాంబవంతుడు పరుగెత్తు కొచ్చాడు. జాంబవంతుని వెంట భల్లూకాలన్నీ రాళ్లు, చెట్లూ పెకలించు కొచ్చి రావణుణ్ణి రెక్కోలిపి వాణ్ణి కొట్టడం మొదలెట్టాయి. బలవంతుడైన రావణుడు కోపంతో వాళ్లను పట్టుకొని నేలకేసి కొడుతూ వున్నాడు.

తన వాళ్లంతా దెబ్బ తినడం చూసిన జాంబవంతుడు రావణాసురుడి గుండెల మీద తన్నాడు. ప్రచండమైన ఆ దెబ్బకు రావణుడు కళ్లు తిరిగి రథం మీద నుండి క్రింద పడిపోయాడు.

వానర భల్లూకాలన్నీ మూర్ఛ నుండి తేరుకోగానే రాముని వద్దకు వచ్చేశాయి.

రాక్షసులంతా భయపడిపోయి మూర్ఛితుడై పడిపోయినరావణుడిచుట్టూ చేరారు.

అశోక వనంలో ఆ రోజు రాత్రికి త్రిజట సీతాదేవి వద్దకెళ్లి అంతవరకు జరిగిన సంగతంతా చెప్పింది. తెగ్గొట్టబడిన రావణుడి తలలన్నీ మళ్లీ మళ్లీ పుట్టుకొస్తున్న సంగతి వినగానే సీతాదేవి మనస్సుకు చాలా బాధ కలిగింది. ముఖం వాడిపోయింది. తన దురదృష్టానికి చింతిస్తూ లోకకంటకుడైన రావణుడు ఎలా చస్తాడో చెప్పమని త్రిజటను అడిగింది. అప్పుడు త్రిజట ఇలా చెప్పింది.

"తల్లీ, దేవతల శత్రువు అయిన రావణుని హృదయ భాగమందు బాణం తగిలితే అతడు చచ్చిపోతాడు. కాని రాముడు రావణుని హృదయ భాగమందు బాణం ఎందుకు వేయడం లేదంటే, రావణుడి హృదయమందు నీవున్నావు.నీ హృదయమందు రామప్రభువు నివసిస్తున్నాడు. ఆయన ఉదర భాగమందు అనేక భువనాలున్నాయి. కాబట్టి రావణుని హృదయంలో బాణం తగిలితే ఆ భువనాలన్నీ నాశనమైపోతాయి." అన్నది. ఈ మాటలు వినగానే సీతాదేవికి అమితమైన ఆనందమూ, బాధా కలిగాయి.

అప్పుడు త్రిజట కలుగజేసుకొని- అమ్మా, సందేహించవద్దు. శత్రువు ఎలా చనిపోయేదీ నేను చెబుతాను. విను, మాటి మాటికీ తలలు తెంచి వేస్తూ వుంటే, అతడు వ్యాకులత చెందిపోతాడు. అప్పుడు అతడి మనస్సు నుండి నీ ధ్యానం తొలిగి పోతుంది. అప్పుడు అంతర్యామి శ్రీరాముడు రావణుని హృదయమందు

బాణంతో కొడతాడు-అని చెప్పి తన ఇంటికి వెళ్లిపోయింది.

రామచంద్రుని స్వభావాన్ని తల్చుకోగానే సీతాదేవి విరహ బాధ మరీ ఎక్కువయి పోయింది. రాత్రిని చంద్రుణ్ణి నిందించడం మొదలెట్టింది. ఒక్కో రాత్రి ఒక్కో యుగం లాగా అనిపిస్తుంది. రాత్రి ఎంతకూ గడచిపోవడం లేదు. రాముణ్ణి తల్చుకుంటూ విలపిస్తూ వుండి పోయింది. విరహం కారణంగా మనస్సులో దారుణమైన తపన బయలుదేరింది. ఇంతలో ఆమె ఎడమ కన్ను, ఎడమ భుజం అదిరాయి. శుభ శకున మనుకుంది. ధైర్యం తెచ్చుకొంది. కృపాలు డైన శ్రీ రామచంద్రుడు తప్పకుండా కలుసుకుంటాడనుకుంది.

అటు అర్ధ రాత్రికి రావణుడి మూర్ఛ తొలగిపోయింది. మేలుకొన్నాడు. తనను యుద్ధ క్షేత్రం నుండి ఎందుకు వేరు చేశావని సారథిపైన మండి పడ్డాడు. తెల్లవారగానే మళ్లీ రథం ఎక్కి యుద్ధ భూమికి పరుగుతీశాడు.

రావణుడు వచ్చాడని తెలియగానే వానరుల్లో అలజడి బయలుదేరింది. వాళ్లంతా చెట్లూ, కొండలూ పెళ్లగించుకొచ్చి పళ్లు పటపటా కొరుకుతూ ముందుకు పరుగెత్తారు. రాక్షస సేనను చెల్లా చెదరు చేసి రావణుణ్ణి చుట్టుముట్టారు. చేతులతో కొట్టి గోళ్లతో గీకి అతణ్ణి బాధపెట్టారు. ఈ బాధకు తట్టుకోలేక రావణుడు అదృశ్యమై పోయి మాయను వ్యాపింప చేశాడు.

భయంకరమైన రూపాలు కనపడ్డాయి. బేతాళుడు, భూతాలూ, పిశాచాలూ చేతుల్లో ధనుర్బాణాలతో ప్రత్యక్షమైనారు. యోగినులు ఒక చేత్తో కత్తి, రెండో చేత్తో మానవ కపాలం ధరించి, రక్తం తాగుతూ, ఆడుతూ, పాడుతూ వున్నారు. పట్టుకోండి, చంపండి అని గట్టిగా కేకలు పెడుతూ వున్నారు. నోళ్లు తెరుచుకొని ముందుకువస్తూ వుంటే వానరులు పరుగెత్తడం మొదలెట్టారు. వానరులు ఎటు పరుగెత్తితే అటు మంటలు మండుతూ కనిపిస్తున్నాయి. వానర భల్లూకాలు కలవర పడిపోతున్నారు. ఇంతలో రావణుడు ఇసుక కురిపించడం మొదలెట్టాడు. వానరు లందరినీ అల్లకల్లోలం చేసి రావణుడు గర్జిస్తూ వున్నాడు. లక్ష్మణ సుగ్రీవులతో సహా అందరూ అచేతనులై పోయారు. రామా, రఘురామా, అని తల్చుకుంటూ వీరులందరూ అసహాయులై పోయారు.

ఈ విధంగా అందరి బలాన్ని హరించి రావణుడు మరొక మాయ చేశాడు. ఎంతో మంది హనుమంతులను సృష్టించాడు. వాళ్లంతా రాళ్లు పట్టుకొని శ్రీ రాముని వైపు పరుగెత్తారు. నలు వైపులా గుంపులు గుంపులుగా చేరారు. తోకలు ఎత్తుకొని విసురుతూ - కొట్టండి, పట్టుకోండి- అంటూ వున్నారు. ఎటు చూసినా తోకలు అందంగా ఎగురుతూ వున్నాయి. వాళ్ల మధ్య శ్రీరాముడు శోభాయమానంగా వున్నాడు. దేవతలు సంతోషంతోనూ బాధతోనూ జయజయ నాదాలు చేస్తూ వున్నారు. అప్పుడు రాముడు ఒకే ఒక్క బాణంతో మాయనంతా పటాపంచలు చేసేశాడు.

మాయ అంతా తొలగిపోగానే వానర

భల్లూకాలు సంతోషించాయి. మళ్లీ చెట్లు రాళ్లు చేత బట్టుకొని బయలుదేరారు. రాముడు రావణుని మీద బాణ వర్షం కురిపించాడు. దాంతో రావణుడి తలలు, భుజాలు తెగి పడిపోతున్నాయి. ఇలాంటి రామ రావణ యుద్ధ చరితాన్ని ఎంతో మంది ఆది శేషులు, సరస్వతీ వేదాలు, కవులూ అనేక కల్పాల వరకు గానం చేస్తూ వున్నా తృప్తి చెందలేరు. అలాంటి చరితంలోని కొన్ని గుణగణాలను మంద బుద్ధి గల తులసీదాసు వర్ణిస్తూ వున్నాడు. ఈగకూడా తన పురుషార్థం ప్రకారం ఆకాశంలో ఎగురుతూ వుంటుంది గదా!

ఎన్నిసార్లు రావణుడి తలలు, భుజాలు తెగ్గొట్టినా మళ్లీ మళ్లీ పుట్టుకొస్తూనే వున్నాయి. కాని రావణుడు చావడంలేదు. రామప్రభువు లీలలు చూపిస్తూ వున్నాడు కాని మునులు, సిద్ధులు దేవతలు గాబరాపడి పోతూ వున్నారు. లాభం కలిగినప్పుడల్లా లోభం పెరుగుతూ పోతున్నట్లుంది. అప్పుడు రాముడు విభీషణుడి వైపు చూశాడు.

"ప్రభూ, ఇతడి నాభియందు అమృత కలశం వుంది. దాని వల్లనే చావడంలేదు" అన్నాడు విభీషణుడు.

వెంటనే రాముడు భయంకరమైన బాణాన్ని ఎక్కు పెట్టాడు.

ఆ క్షణాన రకరకాలైన అపశకునాలు కనిపించాయి. గాడిదలు, నక్కలు, కుక్కలు అరుస్తున్నాయి. పక్షులు అశుభం పలుకుతున్నాయి. ఆకాశంలో తోకచుక్కలు కనిపించాయి. మండోదరి హృదయం కంపించిపోయింది. ఆకాశం నుండి పిడుగులు పడ్డాయి. గాలి తీవ్రమయింది. భూమి కంపించింది. మేఘాలు రక్తవర్షం కురిపించాయి.

భయకంపితులైన దేవతలను చూశాడు రాముడు. ధనుస్సును ఆకర్ణాంతంలాగి ముప్పయ్యొక్క బాణాలు వొదిలాడు. ఆ బాణాలు కాల సర్పాల్లాగా ముందుకు దూసుక పోయాయి.

ఒక్క బాణంతో రావణుని నాభి యందున్న అమృత కలశం ఒట్టిపోయింది మిగతా ముప్పయి బాణాలు పదితలలను, ఇరవై భుజాలను తుంచి వేశాయి.

రావణుడి మొండెం నేలకూలింది. ఎగరడం మొదలెట్టింది. అప్పుడు రాముడు మరో బాణంతో కొట్టి దాన్ని రెండు ముక్కలు చేశాడు.

రావణుడు చస్తూ చస్తూ "రాముడెక్కడ? వాణ్ణి యుద్ధంలో చంపి వేస్తాను" అంటూ భయంకరంగా అరిచాడు.

రావణుడు చావగానే భూమి కంపించింది. సముద్రాలు, నదులు తోసంచిపోయాయి. దిగ్గజాలు, పర్వతాలు అదిరిపోయాయి.

రామ బాణాలు రావణాసురుని తలలు భుజాలు తుంచుకొనిపోయి మండోదరి ముందు పడవేసి తిరిగి రాముని తూణీరం చేరుకొన్నాయి.

దేవతలు సంతోషించారు. రావణుని తేజస్సు రాముని ముఖంలో లీనమై పోయింది. ఇది చూసిన ఈశ్వరుడు బ్రహ్మ ఆనందించారు. బ్రహ్మాండమంతా జయ జయ నినాదాలతో నిండిపోయింది.

(ఇంకా ఉంది)

## రాజాశ్రేష్ఠి లేనిలోటు తీర్చరానిది

– మదళ్ళపల్లె సుబ్బరాయుడు

శ్రీ పోలేపల్లె వెంగన్న (రాజా) శ్రేష్ఠి గారు విశేషజ్ఞాన సంపన్నులు. నిత్య కర్మిష్ఠి సంఘసేవాతత్పరులు. మా వల్లూరు ఆర్యవైశ్య సంఘానికి ఆయన మూల స్తంభము. ఆయన ఆశీస్సులు మాకు కొండంత బలాన్ని ఇస్తే ఆయన సూచనలు మాకు చక్కని మార్గదర్శకంగా ఉండేవి. ఆయన మరణం కేవలము వల్లూరు ఆర్యవైశ్యులకేకాక, యావత్తు ఆర్యవైశ్యులకు ఎన్నటికీ తీరని లోటు. అని వల్లూరు ఆర్యవైశ్యసంఘం అధ్యక్షులు శ్రీ మదళ్ళపల్లె సుబ్బరాయుడు శ్రేష్ఠి గారు 5.6.94వ తేదీన జరిగిన శ్రీ రాజా శ్రేష్ఠి గారి మరణమును గురించి సంతా పాన్ని తెలుపుతూ ఆయన ఆత్మకు శాంతిని ప్రసాదించమని జగజ్జననినికోరారు.

## ప్రొద్దుటూరులో నూతన గోపుర విమాన మహాకుంభాభిషేకము

కడప జిల్లా ప్రొద్దుటూరు పట్టణము లోని శ్రీ వాసవీ దేవ్యాలయముపై నూతనంగా నిర్మించిన విమాన మహా కుంబాభిషేకము 3.6.1994వ తేదీన జరిగింది. 30.5.94 నుండి 3.6.94 వరకూ పంచాహ్నిక దీక్షతో జరిగిన ఈ కార్యక్రమంలో భాగంగా శ్రీ వాసవీ దేవ్యాలయ సంప్రోక్షణ కూడ 3.6.94న జరిగింది.

## వైశ్యులందరూ సంఘటితం కావాలి

– నందారం వెంకటయ్య

వైశ్యులందరూ సంఘటితం కావలసిన సమయం ఆసన్నమైందని మహబూబ్ నగర్ జిల్లా కొడంగల్ మాజీశాసనసభ్యులు శ్రీ నందారం వెంకటయ్యగారు పిలుపు నిచ్చారు. 20.5.94వ తేదీన మహబూబ్ నగర్ జిల్లా కుల్వకుర్తి గ్రామములో శ్రీ వాసవీ జయంతి సందర్భంగా ఏర్పాటైన ఒక సభకు అధ్యక్షత వహించిన శ్రీ వెంకటయ్య గారు తమ అధ్యక్షోపన్యా సములో పై విధంగా అన్నారు. సహజంగా వైశ్యులు వర్తకము నందే ఎక్కువ శ్రద్ధ, దృష్టి కేంద్రీకరణ చేస్తున్నందున ఇతర కార్యకలాపాల్లో చురుకుగా పాల్గొన లేకున్నారనీ, అందువల్లనే ఇతరులు మనలను చులకనగా చూస్తున్నారనీ, మనమంతా ఐక్యమై మన శక్తి ఏమిటో తెలియజేయాలనీ కూడ ఆయన తన అధ్యక్షోపన్యాసంలో పేర్కొన్నారు.

## కాశీవైశ్య సత్రములో నిత్యాన్నదాన ప్రారంభం

భారతదేశములోని ముఖ్య పుణ్య క్షేత్రాలలో ఒకటైన కాశీక్షేత్రములో "క్షేమేశ్వరఘాట్" వద్ద నూతనంగా నిర్మించిన ఆర్యవైశ్య యాత్రీకుల వసతి భవనము నందు 3.6.94వ తేదీ నుండి కాశీని సందర్శించుటకు వచ్చు వైశ్య యాత్రీకులకు ఉచిత భోజన నివాస వసతులు ప్రారంభించబడినవి.

## క్కెర వ్యాధి, రక్తపోటు (బీ.పి.)



డా॥ గ్రంథే రఘురామ గుప్త



డా. జి.వెంకట ప్రసాద్

'ఆయుర్వేద మార్తాండ' డాక్టర్ గ్రంథే రఘురామగుప్త గారికి, (మార్కాపురం. ప్రకాశం జిల్లా – 523 316.)

ఆర్యా !

నమస్సులు. నేను 20 సం॥లుగ బి.పి. తోను 10 సం॥లు పైగా షుగర్ వ్యాధితోను పీడింపబడితిని. ఎన్నో విధములగు ఔషధములు సేవించితిని. మద్రాసులోని డయాబెటిక్ రీసర్చ్ సెంటర్‌కు 3 పర్యాయములున్నూ, ఢిల్లీలోని రాంమనోహర్ లోహియా ఆస్పత్రిలో ఒకసారి పరీక్షలు చేయించుకొని వారి సలహామేరకు ఔషధములు సేవించితిని. కాని, సదరు మందులు సేవించునంత వరకు మాత్రమే వ్యాధులు తగ్గుచుండెడివి. మీరిచ్చిన ఔషధములు నేను పథ్యము లేకుండ 10 మాసములు సేవించితిని. మీ ఔషధ ప్రభావము వలన, నాకు 6 మాసములకు పూర్తి ఆరోగ్యము కలిగినది. ఇప్పటికి ఒక సం॥నకు పైగా నాకు ఆ రోగ చిహ్నములు లేవు. నేను అపుడపుడు తీపి పదార్థములు కూడ తినుచున్నాను, మీ సిద్ధ వైద్యమునకు నా నమస్కారములు.

ఏనుగు చెట్టు వీధి,
ఒంగోలు. ప్రకాశం జిల్లా.
10.7.92.

భవదీయుడు
(Sd.) కొణిజేటి శ్రీమన్నారాయణ,
మాజీ మునిసిపల్ కౌన్సిలర్

ఎంతచేసినా చివరికి మిగిలే ఋణాలు – అర్ధాంతర మరణాలు – మరెన్నో దారుణాలు – సాధారణమనుకొంటున్నారా? ఇలాంటి దుష్పరిణామాలకు మీ యింటి వాస్తు దోషాలు కావచ్చు కారణం.

కాశీ నుండి కన్యాకుమారి వరకు వాస్తు పరిశోధనా పర్యటన గావించి, తన వాస్తు పాండిత్య రచనా వైశిష్ట్యం వలన "వాస్తుశాస్త్ర వాస్తవాలు" పలుపత్రికలలో ప్రచురణ కావడానికి, గ్రంథం రూపం సంతరించుకొనడానికి కారకుడైన రచయిత – సభూతో సభవిష్యత్తుగా సూత్రీకరింప బడిన "వాస్తు సూక్తుల" నిర్మాత – ఖండాలు, అఖాతాల వాస్తు రీతులను అగాధ పరిశీలనార్థం పాఠకుల ముందుంచిన 1993 వాస్తు క్యాలండర్ సంధాత – శ్రీ బి.నాగభూషణ రెడ్డి గారు పదవీ విరమణానంతరం తన అమూల్య వాస్తు సలహాలను అందించేందుకు ఇప్పుడు అందరికీ అందు బాటులోనికి వచ్చారు. సమస్త వాస్తు సమస్యల పరిశీలనకు, నూతన నిర్మాణాలకు వారిని సంప్రదించండి – సఫలీకృతులు కండి.



శ్రీ బి. నాగభూషణ రెడ్డి
వాస్తు పరిశీలకులు
*5–1879, గీతాశ్రమం రోడ్,*
*ప్రొద్దుటూరు – 516 360. కడప జిల్లా.*

## అనంతపురములో శ్రీ మేడా నరసింహులు గారికి సన్మానం

హైదరాబాద్ పురప్రముఖులు, రాష్ట్ర వైశ్య సంస్థల సమాఖ్య అధ్యక్షులు శ్రీ మేడా నరసింహులు గారిని 28.4.94వ తేదీన అనంతపురములోని టి.సి.ఎస్. గోల్డు మెడల్ ట్రస్టు మరియు ఆర్.సి.వి.యస్. ఓల్డ్ స్టూడెంట్స్ అసోసియేషన్ వారలు సంయుక్తంగా సన్మానించారు. అనంతపురములోని రాయలసీమ కాలేజి వైశ్య విద్యార్థి వసతి గృహంలో జరిగిన ఈ సభలో పలువురు ప్రముఖులు పాల్గొని, శ్రీ నరసింహులు గారి కృషినీ సాధించిన విజయాలనూ వివరించారు. శ్రీ నరసింహులు గారికి 1994 నేషనల్ అవార్డు లభించిన ఫలితంగా ఈ సన్మానం జరిగింది.

## ఎంతో సంతోషం

సాహిత్యములో బాగా పరిశ్రమ చేసి కూడ మరుగునపడిన వైశ్యులైన సాహిత్య వేత్తలను వెలికితెచ్చి పదిమందికి తెలియ జేయుటకు మీరు చేస్తున్న శ్రమ మిక్కిలి శ్లాఘనీయము. 'శ్రేష్ఠి' అను పదానికి మీరొక్కరే సార్థక నామధేయులు. మాతృశ్రీ వాసవీదేవి జయంతి 20.5.94 నాటి ఉదయం శ్రీ వాసవీ సుప్రభాతాన్ని కడప ఆకాశవాణి కేంద్రము నుండి ప్రసారం జరుగుటకు మీరు తీసుకొన్న శ్రద్ధకు కృతజ్ఞతలు.

సి.వి. సత్యనారాయణ శ్రేష్ఠి
యం.ఎ., బి.యస్.,
నంద్యాల.

## ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య ఇంజనీర్ల డైరెక్టరీ

రాష్ట్రంలోని ఆర్యవైశ్య ఇంజనీర్ల వివరాలను పొందుపరుస్తూ ఒక సమగ్రమైన డైరెక్టరీని తీసుకురాదలిచాము. పోస్టు గ్రాడ్యుయేట్లు, గ్రాడ్యుయేట్లు, డిప్లమోలు కలిగున్నవారు వివరాలను పంపవచ్చు. రాష్ట్రప్రభుత్వం, కేంద్ర ప్రభుత్వం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల యాజమాన్యంలోని సంస్థలు, క్వాసి ప్రభుత్వ సంస్థలు, ప్రభుత్వేతర సంస్థలు, విద్యా సంస్థలు, పరిశ్రమలు, స్వయం ఉపాధి పరిశ్రమలు స్థాపించుకొన్నవారు, భవన నిర్మాణకులు, సలహాదారులు, రిటైరైన వారు, నిరుద్యోగులు, రాష్ట్రేతరంగాను, విదేశాలలోను ఉంటున్నవారు తమ పేరు, చిరునామా, అర్హతలు, పిన్ కోడ్, టెలిఫోన్ నెంబర్లను జూన్ 30వ తేదీలోగా ఈ క్రింది చిరునామాకు తెలియజేయాలి.

బి. శ్రీరాములు
B.E., F.I.E., F.I.V.,
1-7-69/57ఎ,
పారడైజ్ క్రాస్ రోడ్స్,
సరోజినీ దేవి రోడ్,
సికింద్రాబాద్ - 500 003.
ఫోన్ ఆఫీసు : 847867
ఇల్లు : 800606

సంకలనకర్త : బట్టేపాటి శ్రీరాములు




విజయవాడ పట్టణం ఎక్స్ డిప్యూటీ మేయర్ శ్రీ కొణిజేటి కన్నయ్యగారి కుమారుడు చి॥సురేష్, యం.బి.బి., గారి వివాహం, గుంటూరు శ్రీ దూపుగుంట్ల రజనీకాంతరావు గారి కుమార్తె చి॥ శాంతి స్వర్ణ, యం.ఏ., గారితో 2.6.94వ తేదీన గుంటూరులోని టి.టి.డి. కల్యాణ మంటపములో వైభవంగా జరిగింది.

అనంతపురం జిల్లా కల్యాణదుర్గం వైశ్య ప్రముఖులు శ్రీ మ్యాడం విశ్వనాథం గారి కుమార్తె చి॥ ఉమామహేశ్వరి వివాహం, హొస్పేట్ శ్రీ చిద్రి రామన్న శ్రేష్ఠి గారి కుమారులు చి॥ క్రిష్ణమూర్తి, బి.కాం., గారితో 3.6.94వ తేదీన హొస్పేటలోని శ్రీ నగరేశ్వర స్వామి దేవాలయములో వైభవంగా జరిగింది.

అనంతపురం పట్టణ ప్రముఖులూ, ప్రసిద్ధ ఆడిటర్లూ శ్రీ అంబటి ప్రభాకర గుప్తగారి కుమార్తె చి॥ శారద, బి.కాం., గారి వివాహం, కలికిరి వాస్తవ్యులు శ్రీ॥ శ్రీ॥ బండారు రామనాథం శ్రేష్ఠి గారి కుమారులు చి॥ రెడ్డి ప్రకాశ్, బి.కాం., గారితో 26.5.94వ తేదీన అనంతపురం కొత్తూరులోని శ్రీ వాసవీ కల్యాణ మంటపములో వైభవంగా జరిగింది.

*గమనిక :— ఈ శీర్షికన ప్రకటన కావాలను కునే వారు వివాహ శుభ లేఖతో బాటు రూ.116/-లు యం.ఓ. ద్వారా గానీ, డి.డి. ద్వారా గానీ పంపాలి.*

## ఆదాయపు పన్ను చట్టము — రిటర్నులు

సహకార సంస్థలు, ఇప్పుడు అమలులో ఉన్న ఆదాయపు పన్ను చట్టములోని 44 AB సెక్షన్ క్రింద తమ లెక్కలను ట్యాక్సు ఆడిట్ చేయుంచుకోవలసి ఉండిన వారు, ఆదాయపు పన్ను చట్టము లేక ఇతర చట్టముల ద్వారా తమ లెక్కలను ఆడిట్ చేయుంచుకోదలచిన వారు, పై సంస్థలు లేక ఫరములలో మెంబర్లు లేక భాగస్తులయిన వారలు తమ ఆదాయపు పన్ను రిటర్నును గత అసెస్‌మెంట్ సంవత్సరము వలె అక్టోబర్ 31వ తేదీలోగా కాక ఈ (1994) ఆగస్టు 31వ తేదీ లోగానే అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి చేర్చాలి. పైవాటికి సంబంధించిన వారు ఈ మార్పును జాగ్రత్తగా గమనించి సకాలములో తమ రిటర్నులను దాఖలు చేయుటకు తగిన చర్యలు తీసుకోవలెను.

సభ్యత్వ చందా
రూ.400/-

# ఈ నెలలో కర్తవ్యము

(21.6.1994 నుండి 20.7.1994 వరకు)

ఆదాయపు పన్ను చెల్లించు అసెసీలు నాలుగు వర్గాలుగా చట్టములో పేర్కొనబడినారు. అందులో మూడవ వర్గము "ఇతరులు". జీతములు, ఇంటి బాడుగలు వగైరా మాత్రమే ఆదాయముగా కల అసెసీల్సు ఈ ఇతరుల వర్గమునకు చెందుతారు. మీరు ఈ ఇతరుల వర్గమునకు చెందే అసెసీలా? అయితే మీరు మీ ఆదాయపుపన్ను రిటర్న్సను మీకు సంబంధించిన ఆదాయపుపన్ను అధికారికి చేర్చుటకు ఈ(జూన్) నెల 30వ తేదీయే చివరిది. సవరించబడిన ఆదాయపుపన్ను చట్టము ప్రకారము పై జూన్ 30వ తేదీకి లోగా రిటర్న్సను దాఖలు చేయనివారు సదరు రిటర్న్సను దాఖలు చేయుటకు వ్యవధిని కోరుటకు గతములో లాగా ఇప్పుడు అవకాశం లేదు. ఈ విషయాన్ని సదా మీరు గుర్తుంచుకోవడము అవసరము.

1993-94 లలో మీరు ఎవరికైనా రూ.20,000/-లకు మించి బహుమతి (గిప్టు) ఇచ్చారా? అయితే మీరు ఈ జూన్ నెల 30వ తారీఖు లోగా చేరునట్లుగా అందుకు సంబంధించిన అధికారికి మీ గిప్టు ట్యాక్సు రిటర్న్సను తప్పక పంపాలి. మరువవద్దు.

సి.యస్.టి. ఫారాన్ని రెండు కాపీలుగా అందులో చూపిన మేరకు కట్టవలసిన అమ్మకం పన్నును చెల్లించిన డిమాండు డ్రాప్టుతో మీకు సంబంధించిన అమ్మకం పన్ను అధికారికి జూలై 15వ తేదీకి లోగా పంపాల్సి ఉంది. ఈ విషయాన్ని గుర్తుంచుకోండి.

మీరు పంపవలసిన A-2 రిటర్న్సను చలానాతోబాటు అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖ అధికారికి పంపుటకు జూలై నెల 20వ తేదీయే చివరిది. మీరు పంపు ఆ A-2 రిటర్న్సను చలానాతోబాటు కాకుండా చెక్కుతో పంపాలనుకున్నారా? అయితే ఆ విధంగా A-2 రిటర్న్సను చెక్కుతో బాటు పంపుటను జూలై నెల 15వ తేదీలోగానే చేయాలి.

## అనంతపురం కొత్తవూరు ఆర్యవైశ్య సంఘానికి నూతన కార్యవర్గం

పై సంఘం సర్వసభ్యసమావేశము - ఎన్నికలు 5.6.1994వ తేదీన అనంతపురం కొత్తవూరులోని శ్రీ వాసవీ కల్యాణమండపములో జరుగ క్రింది వారలు నూతన కార్యవర్గ సభ్యులుగా ఎన్నికైరి. గౌరవాధ్యక్షులు శ్రీ దొంతి విశ్వనాథగుప్త, అధ్యక్షులు శ్రీ పరుచూరు క్రిష్ణమూర్తి, ఉపాధ్యక్షులు శ్రీ గోపాముచ్చా నరసింహులు, కార్యదర్శి శ్రీ మంచికంటి రంగయ్య, సహాయ కార్యదర్శి శ్రీ నామాసూర్యనారాయణ శ్రేష్ఠి కోశాధికారి శ్రీ రాచర్ల మల్లయ్య గుప్త.

